# కార్మికవర్గం - దేశరక్షణ


కామ్రేడ్ బి. టి. రణదివె

అనువాదం:

యం. ఆనందమోహన్



ప్రజాశక్తి కార్యాలయం

:: బెజవాడ ::

# ఒకమాట

28-5-43 తేదీన జరిగిన భారతకమ్యూనిస్టుపార్టీ ప్రధమ కాంగ్రెసులో కామ్రేడ్ బి. టి. రణదివే కార్మికరంగంలో పార్టీ కృషినిగురించి యిచ్చిన రిపోర్టు ఈ పుస్తకంలో ప్రకటించబడింది. దీనిలో 1942 సెప్టెంబరులో జరిగిన సెంట్రల్ కమిటీ ప్లీనం ప్యాసుచేసిన తీర్మానంకూడా జతపరచబడింది. తీర్మానం ప్రజాయుద్ధ కాలంలో కమ్యూనిస్టుపార్టీ కార్మికులను ఐక్యపరచి దేశరక్షణకొరకు, అధికోత్పత్తికొరకు ఎలాముందుకునడపాలో వివరించబడింది. కాంగ్రెస్‌లో యిచ్చిన రిపోర్టులో కామ్రేడ్ రణదివే పై కర్తవ్యాన్ని ఎంతవరకు నెరవేర్చామో, ఏయే సందర్భాలలో పొరబాట్లు చేశామో స్పష్టంగా తెలిపాడు. అందుచే ఇది, కార్మిక రంగంలో కమ్యూనిస్టుపార్టీ పాలసీని తెలిపే ముఖ్యమైన పుస్తకం.

ఈ పుస్తకాన్ని తెలుగులో వెంటనే అందజేయలేకపోయినందుకు సంపా ం క్షమాపణ కోరుతూంది. ఇలాంటి ముఖ్యపుస్తకాలను త్వరలో అను చేసి వెంటనే ప్రకటించడానికి యికముందు కృషిచేస్తాము

28—1—44

సంపాదకవర్గం

# విషయ సూచిక

# ఉత్పత్తినిగురించి పార్టీ రిపోర్టు

[ఈ రిపోర్టు 28-5-43 న భారత కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులో కామ్రేడ్ బి. టి. రణదివెచే ప్రవేశపెట్టబడింది.]

ఉత్పత్తి రంగంలో యెంత ప్రమాదకరమైన పరిస్థితి యేర్పడినదీ రాజకీయ తీర్మానం తెలియజేసింది. ఏమిటా ప్రమాదపరిస్థితి ? జపాను దండయాత్రా ప్రమాదం మనదేశాన్ని ప్రత్యక్షంగా ఎదుర్కొంటూన్న సమయంలోనే దేశరక్షణకు కీలకమైన వుత్పత్తికూడ భగ్నమతోంది. ఫలితం, ఆహారసంక్షోభం—పారిశ్రామిక వస్తువుల కొరత విపరీతంగా వ్యాపించియున్న సమయంలోనే రవానాసౌకర్యాలు కూడా తారుమారవుతున్నాయి. అంటే ? యుద్ధశ్రేణికి వెనుకభాగం అంతా (Rear) సర్వనాశనం అయ్యే ప్రమాదం యేర్పడిందన్నమాట.

ఈ పరిస్థితులు యుద్ధరంగానికి ప్రత్యక్షంగా అపాయం కలుగజేస్తాయి. దేశరక్షణకై ప్రాణాలర్పించి పోరుసల్పే సైన్యానికి ఆపద కల్గిస్తాయి. సాధారణంగా సైన్యానికి పారిశ్రామిక వస్తువులు ఎడతెగకుండా సప్లయి చేయబడాలి. యుద్ధ పరికరాలు నిరంతరం వివిధరంగాలకు చేర్చడానికి చక్కని రవానాసౌకర్యాలుండాలి. ఇవి యేవీ సరియైన స్థితిలో లేకపోతే దేశరక్షణ నాశనం కాకతప్పదు.

ఈ పరిస్థితులవల్ల మన దేశానికి యెంత పెద్దప్రమాదం వాటిల్లిందో అతి స్పష్టంగా తెలుస్తోంది. అయినప్పటికీ మనసభ్యులు దీన్ని గుర్తించవలసినంత బాగా గుర్తించుటలేదు. ముఖ్యంగా సైన్యానికి ప్రతిరోజూ చేరవలసిన సరకులు చేరకపోతే దేశరక్షణ కదియెంతనష్టమో అర్థంచేసికోవడంలేదు. ఈసమస్యకూ, దేశరక్షణకూ యెంత ప్రత్యక్షమైన సంబంధం వున్నదో మనవాళ్ళు గ్రహించడం లేదు. అందువల్ల కార్యాచరణకు ముందడుగు వేయడంలేదు.

# 1

## ఉత్పత్తిలో యేర్పడ్డ సంక్షోభం

ఉత్పత్తిలో యేర్పడ్డ సంక్షోభం, దానివల్ల వాటిల్లే ప్రమాదం ఇదంతా మన జాతీయ సంక్షోభంలో ఒకభాగం తప్ప మరోటికాదు. వాయిదా బేరాలవల్ల, విపరీత ధరలవల్ల, అధికచెలామణి (Inflation) వల్ల, నిల్వవ్యాపారం వల్ల బయల్దేరిన ఆర్థిక సంక్షోభంలోనిదే ఈ సంక్షోభంకూడా. ఉత్పత్తిలో యేర్పడ్డ సంక్షోభం ఇతర ప్రధానసమస్యలతో సంబంధంలేకుండా కేవలం పారిశ్రామిక రంగానికి మాత్రమే సంబంధించిన సమస్య అని అనుకోవడం పొరబాటు.

అది యీ క్రింది విధంగా గోచరమవుతుంది.

(1) ప్రభుత్వం వుత్పత్తిని ప్రోత్సహించే యెట్టి ప్లానులు వేయడంలేదు.

(2) దేశరక్షణకు, ప్రజల అవసరాలకు పరిశ్రమలను వినియోగించడానికి ప్రభుత్వం మిల్లు యజమానుల సహకారాన్ని తీసికోవడంలేదు.

(3) ప్రభుత్వం ప్రవేశపెట్టే ప్రతి కంట్రోలు స్కీమును దేశీయ మిల్లు యజమానులు వ్యతిరేకిస్తున్నారు. ఇందువల్ల ప్రభుత్వానికీ - పరిశ్రమలకూ మధ్య సంఘర్షణ బయల్దేరింది. ఈ సంఘర్షణ కాంగ్రెసు సంస్థపై ప్రభుత్వం దాడిచేసినప్పటినుంచీ యింకా యెక్కువైంది. మరోకారణం యేమంటే యజమానులకు వుత్పత్తిపట్ల లాభదృష్టి తప్ప మరొకదృష్టి లేనేలేదు.

(4) అధికోత్పత్తికై ప్రభుత్వము, యజమానులు కార్మికుల సహకారం తీసికోవడం లేదు. సహకారం తీసికోకపోవడమే కాకుండా వారికి న్యాయంకూడా కలగజేయడంలేదు. వారవలంబించే పాలసీవల్ల కార్మికులు తమ కనీసకోర్కెలకై సమ్మెలకు సహితం దిగేటట్లు రెచ్చగొడుతూంది.

జాతీయ రంగంలో ఏయే శక్తులు కలిసి పనిచేస్తున్నాయో అవే వుత్పత్తి రంగంలో కూడా కలిసి పనిచేస్తున్నాయి. ఎలాగో చూదాం.

సామ్రాజ్యవాదులు ఇండియాను కాలనీగానే రక్షించాలను పాలసీతో ప్రజలకు అధికారం యివ్వడంలేదు. అలాగే బ్రిటిష్ పెట్టుబడియొక్క అధికారాన్ని యెక్కువ చేసికోడానికి దేశీయ పరిశ్రమల అభివృద్ధిని ఆటంకపరుస్తున్నారు. ఇందువల్ల దేశీయ పెట్టుబడిదార్లు సామ్రాజ్యవాద పాలసీపై కత్తిగట్టేరు.

ఇతర దేశభక్తుల మాదిరిగానే పారిశ్రామిక పెట్టుబడిదారులు కూడా ప్రభుత్వం చేసిన దాడివల్ల రెచ్చగొట్టబడి కొంతకాలం ప్రతిష్టంభనను కొనసాగించేరు. తరువాత కేవలం లాభదృష్టితోనే వ్యవహరిస్తూ వచ్చారు. ఈ స్వార్ధమే యుద్ధకృషికి నష్టం కలిగిస్తూన్నట్లు పైకి కన్పడుతూంది. ప్రభుత్వం సూచించే ప్రతిప్లానూ తమ న్యాయమైన హక్కులకు, తమ స్వేచ్ఛావ్యాపారానికి భంగం కల్గిస్తున్నట్లు వారు భావిస్తున్నారు.

ఈ పారిశ్రామిక పెట్టుబడిదారులు కార్మికుల న్యాయమైన కోర్కెలను నిరాకరిస్తూ, వారిని బుద్ధిపూర్వకంగా రెచ్చగొట్టడంవల్ల సమ్మెలను ప్రోత్సహించే పంచమాంగదళానికి చక్కని రాజబాటను నిర్మించినవారవుతున్నారు.

ఇక కార్మికులో? పార్టీ నాయకత్వం క్రింద వుత్పత్తిని కాపాడుటకు వీరు సర్వశక్తులు వినియోగిస్తున్నారు. ఉత్పత్తి ఆగిపోకుండా యెంతకాలం ఓపిక పట్టగలరో అంతకాలం ఓపికతో పనిచేస్తున్నారు. పంగమాంగదళాన్ని, విధ్వంసకుల్ని బయటపెట్టి వారిని అణచడానికి కృషిచేస్తున్నారు. దేశరక్షణకై వుత్పత్తినెక్కువచేయుటకు పూనుకొంటున్నారు.

## సంక్షోభంయొక్క స్వరూపం.

దండయాత్ర ప్రమాదం అత్యధికంగావున్న యీ సమయంలో, ఆహార సమస్యపై సామాజికవిధానం విచ్ఛిన్నమైపోయే ప్రమాదం యెక్కువగావున్న యీనాడు, సంక్షోభంయొక్క స్వరూపాన్ని పూర్తిగా అర్ధంచేసికొనుట అవసరం. ఎందువల్లనంటే, అది మనజాతీయ జీవనాన్ని పూర్తిగా తారుమారు చేసేటట్లుంది. యుద్ధరంగానికి, దాని వెనుకభాగానికి (Rear) కూడ అపాయం కల్గించేటట్లుంది. మనజీవితమే తలక్రిందుగా కూలిపోయే అపాయం నేడు యెక్కువగా వుంది.

మొదటి విషయం : మనదేశం, మనప్రజలు కేవలం బ్రతకాలన్నా ఉత్పత్తినెక్కువ చేయాల్సిన రోజుల్లో ఉత్పత్తి తగ్గుతోంది.

దేశరక్షణకు ప్రధానమైన సరకుల వుత్పత్తి యేవిధంగా తగ్గుతోందో, లేదా అలాగే నిలబడియుంటూందో, కొన్ని సందర్భాలలో మాత్రం స్వల్పంగా యెక్కువైందో, యీ క్రింది అంకెలవల్ల తెలిసికోవచ్చు.

## మొత్తం పారిశ్రామికోత్పత్తి*

| | |
|---|---|
| 1940 ఫిబ్రవరిలో | 116.9 |
| 1943 ఫిబ్రవరిలో | 110.2 |

(యుద్ధానికి పూర్వం ఉత్పత్తి 100 వుంటే 1940 ఫిబ్రవరినాటికి 116.9 వరకు హెచ్చిందన్నమాట. 1943 ఫిబ్రవరినాటికి 110.2వరకే హెచ్చిందన్నమాట.

ఒక్కొక్క సరుకుయొక్క వుత్పత్తి యీ క్రిందివిధంగా వుంది.

| | | | |
|---|---|---|---|
| పత్తియొక్క వినిమయం : | 1940 | ఫిబ్రివరిలో | 98.6 |
| | 1943 | ,, | 142.6 |
| జూట్ పరిశ్రిమ : | 1940 | ఫిబ్రివరిలో | 149.2 |
| | 1943 | ,, | 117.9 |
| | 1943 | జనవరిలో | 92.0 |
| ఉక్కు ప్లేట్లు : | 1940 | ఫిబ్రివరిలో | 136.4 |
| | 1943 | ,, | 165.3 |
| పిగ్ ఐరన్ : | 1940 | ఫిబ్రివరిలో | 149.7 |
| | 1943 | ,, | 143.6 |
| బొగ్గు : | 1940 | ఫిబ్రివరిలో | 123.0 |
| | 1943 | ,, | 115.0 |

ప్రత్తియొక్క వినిమయం యెక్కువైనంతమాత్రించేత బట్టలకరువు తీరిందని - అంటే ప్రిజలకు, సైన్యానికి కావలసిన బట్ట పూర్తిగా అందజేయ బడుతూందని - అనుకోడానికి వీల్లేదు. బట్టల సప్లయి పూర్తిగా వున్నట్లయితే నేటి బట్టలకరువుగాని, బట్టల దోపిడీలుగాని జరిగియుండేవేకావు. బట్టల ఖరీదులు వెనుకటికన్నా 4 లేక 5 రెట్లు పెరిగియుండేవేకావు.

---

Capital అనే పత్రికయొక్క 1943 మార్చి సంచికలోని అంకెలు.

శ్రామికుల జీవిత వ్యయంలో బట్టలఖరీదులు యెంత పెరిగిపోయాయో (బొంబాయిలో) చూడండి. *

| | | | |
|---|---|---|---|
| బొంబాయిలో : | బట్టల ఇండెక్సు | మార్చిలో | 255 |
| | | ఏప్రిల్‌లో | 374 |
| అహమ్మదాబాదులో : | | ఫిబ్రివరిలో | 264 |
| | | మార్చిలో | 315 |
| నాగపూరులో : | | ఫిబ్రివరిలో | 368 |
| | | మార్చిలో | 450 |
| జబ్బల్‌పూరులో : | | ఫిబ్రివరిలో | 374 |
| | | మార్చిలో | 445 |
| మద్రాసులో : | | ఫిబ్రివరిలో | 197 |
| | | మార్చిలో | 205 |

బట్టల వుత్పత్తి యెక్కువౌతున్నా ప్రజల అవసరాలు మాత్రం తీరడం లేదని స్పష్టమే.

జూటు పరిశ్రమల్లో 20% తగ్గుదల కన్పించింది. (Steel in gots) ఉక్కుప్లేటు 20% యెక్కువ తయారౌతున్నాయి. అదేసమయంలో యినుము (పిగ్ ఐరన్) వంటి ప్రధానమైన సరుకులోనే రమారమి 4% తగ్గుదల కన్పిస్తూంది. ఫిబ్రివరి 1940 మొదలు యీ 36 నెలల్లోనూ మొత్తం మూడుసార్లు మాత్రమే పిగ్ ఐరన్ వుత్పత్తి 1940 లెవెలును దాటింది.

బొగ్గు పరిశ్రమ విషయం మరీ దారుణంగా వుంది. భారతదేశంయొక్క పారిశ్రామిక విధానం, విద్యుచ్ఛక్తి పరిశ్రమలు, రాకపోకల మార్గాలన్నీగూడ పూర్తిగా బొగ్గుమీదనే ఆధారపడివున్నాయి. జపానుసైన్యాలు మన సరిహద్దులలో కొచ్చి, మనదేశం యుద్ధరంగంగా మారినప్పటినుంచీ మన రైల్వే రహదారుల మీదా-తద్వారా బొగ్గుకొరకు డిమాండు చాల యెక్కువైంది. సైన్యానికి సప్లయిలు తీసుకెళ్ళడానికి రైల్వేలు ఎంతో యెక్కువ బరువును మోయాల్సొస్తూంది. పైగా ప్రజలకు కావాల్సిన ఆహార పదార్థాలు మొ॥ కూడా ఒకచోటనుండి మరొక

* బొంబే లేబర్ గజెట్, ఏప్రిల్ 1943, పేజీ 553.

చోటికి యెక్కువగా రవాణా చేయవలసిన అవసరం యెక్కువైంది. అంటే బొగ్గు వుత్పత్తిని యెన్నోరెట్లు యెక్కువ చేయాల్సిన అవసరం వుందన్నమాట. కాని, నేడువున్న పరిస్థితి యేమిటి? 1940 లో మన పరిశ్రిమలన్నీ రాత్రిళ్ళు పనిచేసేవికావు. మన రైల్వేలకు యిప్పుడున్నంత రద్దీలేదు. అట్టి 1940 లో మనం వుత్పత్తిచేసిన బొగ్గుకంటెగూడ యీనాడు చాలతక్కువ బొగ్గు వుత్పత్తి అవుతూంది. ఈనాడు మన దేశాన్నెదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితుల్లో గూడ మన పారిశ్రామిక యంత్రిం పూర్తిగా శిధిలమయే పరిస్థితు లేర్పడుతున్నాయని చెప్పడానికింతకన్నా నిదర్శనం అక్కర్లేదు. బొగ్గు కొరతచేత ఫ్యాక్టరీలు నెలల కొలదీ ఆగిపోయినా, ప్రిజలు యింకా యెక్కువ గుడ్డలు కావాలంటూన్నప్పుడు బట్టలమిల్లులు మూసివేయబడినాకూడ యేమీ ఆశ్చర్యపడవలసిన పనిలేదు నేటి పరిస్థితులను బట్టి,

## ఆర్ధిక విధానంలో విచ్ఛిత్తి. మొదలెట్టింది

## ( Disruption from the Economic end )

ఉత్పత్తిలో యేర్పడ్డ సంక్షోభం సమ్మెలరూపంలోకూడ వ్యక్తమౌతుంది. యజమానులు, ప్రిభుత్వం కార్మికులయెడల నవలంబించే పాలసీవలన వారు సమ్మె చేయకతప్పని పరిస్థితు లేర్పడుతాయి. ఇక్కడ ప్రిధాన కారణం యేమి టంటే, కార్మికుల జీతాలులాగేవుండి, వారి జీవిత వ్యయంమాత్రిం యెన్నోరెట్లు పెరిగిపోవడం. ఈ రెండిటికీగల తేడామూలాన కొన్ని ప్రధాన పరిశ్రిమలలోని కార్మికులుకూడా వెంటనే తమ్మెదుర్కొంటూన్న ఆకలిబాధనుండి తప్పించుకొను టకుగాను పనిని కట్టిపెట్టవలసి వస్తూందికూడాను.

ఈ క్రింది అంకెలనుబట్టి కార్మికుల జీవిత వ్యయం యెంతగా పెరిగి పోయిందో తెలుస్తుంది.

| నగరం | ఆగస్టు 1939 | మార్చి 1943 |
|---|---|---|
| బొంబాయి | 105 | 208 |
| అహమ్మదాబాదు | 73 | 173 |
| షోలాపూరు | 73 | 160 |

| నగరం | ఆగస్టు 1939 | మార్చి 1943 |
|---|---|---|
| నాగపూరు | 64 | 165 |
| జబ్బల్‌పూరు | 58 | 161 |
| పాట్నా | 109 | (జనవరి) 243 |
| కటక్ | 103 | 239 |
| మద్రాసు | 98 | 170 |
| లాహోరు | 120 | (జనవరి) 315 |
| కాన్పూరు | 100 | 246 |
| కలకత్తా | (యుద్ధానికిముందు) 100 | (మే) 286 |

జీవితవ్యయం యింత పెరిగిపోయినా దానికి తగినట్లు కార్మికుల జీతాలు మాత్రం యేమీ పెరగలేదు. 'జీవిత వ్యయం హెచ్చినకొలదీ జీతాలుకూడా హెచ్చాలి. జీవితవ్యయంలో గలిగిన హెచ్చుదలకు తగిన కరువు భత్యాలు (Dearness allowance) యివ్వాలి' అనేవి యేకొద్ది పరిశ్రమల్లో మాత్రమే- అదైనా సమ్మెలు జరిగినతర్వాతనే - గుర్తింపబడినాయి. వాటిల్లో కూడ యిచ్చిన కరువుభత్యం యెంతమాత్రమూ సంతృప్తికరంగా లేదు. ఒక్క అహమ్మదాబాదును మినహాయిస్తే యింకెక్కడా ఈభృతి జీవితవ్యయంలోని హెచ్చుదలలో 100 కి 60 వంతులు దాటలేదు. చాలచోట్ల ఈభృతి కళ్ళనీళ్ళు తుడిచేదిగానేవుంది గాని యేమీ సంతృప్తికరంగాలేదు. జీవితవ్యయంలోని పెరుగుదలలో 20% కూడా లేదు.

ప్రభుత్వ యాజమాన్యంక్రింద నున్న రైల్వేలు, బొగ్గుగనుల యజమానులు, జూట్ పారిశ్రామికులు ముఖ్యంగా యీ విషయంలో దోషులని నిస్సందేహంగా చెప్పవచ్చును. కార్మికుల కివ్వవలసిన కరువుభత్యం యివ్వక రైల్వే బోర్డు యించుమించు దేశవ్యాపితమైన రైల్వే సమ్మె బయలుదేరే పరిస్థితులను కల్పించింది. నిజంగా అటువంటి సమ్మెజరుగకుండా ఆగిందంటే దానికి సుశిక్షిత నిర్మాణంగల్గియున్న రైల్వే యూనియనులే కారణం అని చెప్పాలి.

ఆగస్టు 9 న రాజకీయ రంగంలో (National front) పరిస్థితి యెంత క్లిష్టంగావుందో, పారిశ్రామిక రంగంలోకూడ పరిస్థితి అంత తీవ్రంగానువుంది.

అది పూర్తిగా బ్రిద్దలై సమ్మెలతో దేశాన్నంతనూ అశాంతి జ్వాలలలో ముంచి వేయకుండా ఆగిందంటే దానికి మనమే - పదిహేను సంవత్సరాలుగా ట్రేడు యూనియను వుద్యమాన్ని నిర్మించిన మనపార్టీయే - కారణం అని చెప్పాలి.

అయినా పరిస్థితి చాల దారుణంగావుంది. పంచమాంగదళ ప్రచారానికి చాల అనుకూలమైన వాతావరణం అదే. కొన్నాళ్ళు దేశభక్తి బురఖాతో పూరేగిన పంచమాంగదళం యీ పరిస్థితుల నదనుగా తీసుకొని తానే కార్మికుల ఆర్థిక కష్టాలను, దైనందిన సమస్యలనుతీర్చే రక్షకుడుగా వారిని దోపిడీ విధానంనుండి తప్పించేందుకు కంకణంకట్టుకున్నట్లుగా డబ్బాకొడుతూ కార్మికుల్లో ప్రవేశించి వారి సానుభూతిని సంపాదిస్తుంది. ఉత్పత్తిని తగ్గించేందుకు (Go-slow - movement) సమ్మెలద్వారా పారిశ్రామిక వుత్పత్తిని కుంటువరచేందుకు (Sabotage) తీవ్రంగా ప్రయత్నిస్తూంది. యజమానులు, ప్రభుత్వమూ అవలంబించే మూర్ఖ విధానంమూలంగా కార్మికుల్లో అణగియున్న క్రోధం, అసంతృప్తి విజృంభించి సమ్మెలకు దారితీస్తుంది.

ఏ విధానం దేశభక్తులు దేశరక్షణను భగ్నం చేసేటట్లుగా రెచ్చగొట్టిందో ఆదే విధానం యీనాడు—కార్మికుడు తనదేశ రక్షణకు, ప్రజల రక్షణకొరకు దేశంలో వుత్పత్తి నధికం చేయవలసిన యీనాడు— దేశోత్పత్తి విధానాన్నే విధ్వంసం చేసేటట్లుగా కార్మిలను రెచ్చగొడుతూంది.

పారిశ్రామిక రంగంలో మన వెనుకతట్టు (Rear) చాల బలహీనంగా వుంది. దేశరక్షణకు మూలాధారమైన ఉత్పత్తియే కూకటివ్రేళ్ళతో కూలిపోడానికి సిద్ధంగా వుంది.

# 2

## మన పాలసీ — దాన్ని యెలా ఆచరణలో పెట్టాలి

కామ్రేడ్సు, యిటువంటి క్లిష్టపరిస్థితుల్లో మనం ప్రజలకూ, కార్మిక వర్గానికీ యెట్టి మార్గాన్ని చూపేము? దేశభక్తియుతమైన పార్టీలన్నిటిలోనూ మనం ఒక్కరమే వుత్పత్తియెడల ఒక నిర్మాణాత్మకమైన జాతీయదృక్పథాన్ని పెంపొందించి యెన్ని ఆటంకములు కల్గినా వెనుతీయక దాని నాచరణలో పెట్టుటకు కృషి చేసేము.

ఆగస్టు 9 (1942) తర్వాత కాంగ్రెసు దేశభక్తు లనేకులు వుత్పత్తి సాగకుండా చేయుటకు తీవ్రంగా పనిచేసేరు. అసలు ఆగస్టు 9 తర్వాత సర్వరస్వారాజ్య సంపాదనకు వారి ప్రధానాయుధం వుత్పత్తిని నిలిపివేయుటే. ఉత్పత్తి దేశరక్షణలో ఒక ప్రధానాంగం అందుచే దానిని సరిగా కొనసాగించుట ప్రజలందరకూ సంబంధించిన బాధ్యత అనే దేశభక్తియుతమైన కాంగ్రెసు నాయకత్వం యెప్పుడూ కూడా కల్గియుండలేదు.

ఉత్పత్తి సమస్యలమీద ముస్లింలీగు కేవిధమైన పాలసీగాని, దృక్పథంగాని లేనేలేదు. దేశరక్షణ విషయంలో వలెనే యిందులో కూడ అది చొరవను ప్రభుత్వం చేతిలోనే వొదిలేస్తూంది. ఉత్పత్తిలో కల్గిన అరాజకం మొదలైనవాటికి లీగు దృష్టిలో యెట్టి ప్రాధాన్యతాలేదు. కాని మనదృష్టిలో దేశరక్షణ అనేది వట్టి అర్థంలేని నినాదంమాత్రమే కాదు. ఏవో కొన్ని షరతులంగీకరిస్తేనే దానికి పూనుకుంటాము అని బేరమాడదగిన వ్యాపారం కాదు. జపాను శత్రువు కెదురుగా స్వరక్షణ చేసుకోగలగడం మీదనే మనదేశం యొక్క వునికికూడ ఆధారపడి యుందనే విషయాన్ని మనం గుర్తించాము. తమ మాతృదేశ రక్షణలో యెంతవరకు ప్రజలు తమ చేతిలోకి తీసుకోగలరు అనేదానిమీదనే మన భవిష్యత్తంతా ఆధారపడి యుండని గుర్తించాము.

అదే సమయంలో నేటి ప్రపంచంలో రక్షణకూ వుత్పత్తికీ అవినాభావ సంబంధం వుందని మనకు స్పష్టంగా తెలుసును. ఇతరులు యే షరతులు విధించినా, యెట్టి పరిస్థితి కల్పించినాసరే దేశరక్షణ బాధ్యత ప్రతి దేశభక్తుని మీదా వుంది. అదే విధంగా వుత్పత్తి—దాన్ని సరియైన పద్ధతులమీద పునర్నిర్మించుట, విస్తరింపజేయుట కూడ—ప్రతి కార్మికుని యొక్క విధియని మనం నొక్కి చెప్పేము. ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికీ వుత్పత్తికీ మధ్యగల దగ్గర సంబంధాన్ని, వుత్పత్తి యెడల మన పాలసీని పామీదత్తు యీ క్రింది మాటలలో అతి క్లుప్తంగా చెప్పేడు.

"ఉత్పత్తికీ, యుద్ధతంత్ర, యుద్ధ యెత్తుగడలకీ యెంతో దగ్గర సంబంధం వుంది. నేటి యంత్ర యుద్ధములలో యుద్ధశ్రేణిలో నిలబడి పోరాడే ప్రతి ఒక్క సైనికుని వెనుక అతనికి కావలసిన అవసరాల నుత్పత్తిచేసేందుకు 4, 5 గురు కార్మికులు పనిచేయవలసి యుంటుందని అంచనా వేయబడింది. అంటే, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో పాల్గొనే ప్రజలలో అధికసంఖ్యాకులు తమకృషిని వుత్పత్తి రంగంలోనే కేంద్రీకరించవలసి యుంటుందన్నమాట. ఈ రంగంలోనే ప్రతి పురుషుడూ, ప్రతి స్త్రీ గూడ తమ తమ పాత్రను నిర్వహిస్తూ ఫాసిజంపై విజయం సంపాదించుటకు తమ దృఢనిశ్చయాన్ని తెలుపగలరు.

ఫాసిజాన్నెదుర్కొని జయించాలని బద్ధకంకణుల మయ్యామంటే అర్థం యేమిటి? నాజీ యుద్ధయంత్రాన్నెదుర్కొని ఓడించుటకు కావలసిన ఆయుధాలను వివిధ రంగాలలో పోరాడుతున్న మనసైనికులకు శీఘ్రంగా సరఫరా చేయాలన్నమాట అటువంటి ఆయుధాలన్నీ సకాలంలో యుద్ధరంగాలకు చేరేటందుకుగాను తగిన శ్రద్ధ తీసికోవాలి. రాకపోకలమార్గాలు యే అడ్డంకులూ ఆలస్యమూ లేకుండా పనిచేయుటకు తగిన యంత్రాలను, పారిశ్రామిక వస్తువులను తయారు చేయాలన్నమాట. యుద్ధంచేసే సైనికులకు, ఉత్పత్తిచేసే కార్మికులకూ సైతం కూడు, గుడ్డలు, యితర జీవితావసరములు సమకూర్చి వారి కృషి యేమాత్రం కుంటుపడకుండా చేయాల్సిన బాధ్యత మనది. ఉత్పత్తి నెక్కువచేయుటకు, జయం సాధించుటకు మనలో ప్రతివాడూ తన శక్తినంతనూ వినియోగించి పని చేయవలసి యుంటుంది. ఆ బాధ్యత నంతనూ ప్రభుత్వం మీదనూ, పరిశ్రమల యజమానుల మీదనూ వదలిపెట్టి వూరుకోవడానికి వీల్లేదు. నిర్మాణ కార్యంలో

అర్థంకుల నెదుర్కొనుటలో హృదయపూర్వకంగా సర్వశక్తులను వినియోగించి కృషిచేయుట ప్రతి వ్యక్తియొక్క విధి.

ఒక్క వీరత్వం వల్లనే ఫాసిజాన్ని జయించుట కష్టసాధ్యం. ఆ వీరత్వమును బలపర్చుటకు దానికితోడు శత్రువుకన్న యెన్నోరెట్లు విమానాలు, టాంకులు, ఫిరంగులు, మందుగుండు సామాగ్రి వున్ననాడే ఫాసిజమును సంపూర్తిగా ఓడించుట సాధ్యపడుతుంది. నేటికాలపు యుద్ధాలలో యిరుపక్షాల బలాబలాలను నిర్ణయించే అసలైన గీటురాయి ఇదే. సైనికుల ధైర్యస్థైర్యములు, వారి నైతిక బలము మాత్రమే యుద్ధపర్యవసానమును నిర్ణయించవు. పరికరాలు, చాతుర్యము, నిర్మాణం, నేర్పు, ప్రజలందరి కృషిని, త్యాగశక్తిని సమన్వయించి సరియైన మార్గాల్లో పెట్టగల సామర్థ్యం యెవరికెక్కువగా వుంటాయో ఆ పార్టీ నెగ్గుతుంది. అదీ అసలైన గీటురాయి." (Britain in the World Front)

## మనకు పరీక్షా సమయం (We are tested)

ఆగస్టు 9 తర్వాత వచ్చిన సంక్షోభం మనల నొక గట్టి పరీక్షకు లోనుగావించింది. కార్మికవర్గంపై మన రాజకీయ పలుకుబడి యెంతవుందో అది యెటువంటిదో అనేదే ప్రధానసమస్య. "రాజకీయంగా రెచ్చగొట్టబడిన ఆ నాటి పరిస్థితుల్లో మీ వుత్పత్తి విధానాన్ని ఆచరణలో పెట్టుట అసాధ్యం" అని మన మీద ఆదొక సవాలును విసరింది.

ఉత్పత్తి ఆగిపోకుండా మామూలుగా చూడగలరా అనే సవాలును మనం యెదుర్కొన్నాం. మొదటి దెబ్బలో మనం నెగ్గేం. దేశంలో అంతటా మనకి పలుకుబడియున్న ప్రతి ప్రదేశంలోనూ పారిశ్రామికోత్పత్తి యింమమించుగా నిరాటంక గానే సాగిందని చెప్పవచ్చును. యేదో కొద్దిచోట్ల ఆటంకాలు కల్గినా అవి త్వరలోనే సరిచేయబడినాయి. బొంబాయి మొదలైన ప్రదేశాలలో రెండు మూడు రోజుల్లోనే పరిస్థితులు చల్లబడి వుత్పత్తి మామూలుగా నడిచింది. షోలాపూరు మొ॥ చోట్ల అసలు అల్లర్లే జరగలేదు.

ఇందులో మనం నెగ్గటానికి ట్రేడ్‌యూనియను వుద్యమం మన నాయకత్వం క్రింద వుండుటొక్కటే కారణంకాదు. మన దేశంమీదకు వచ్చిన జపాను

ఫాసిజా న్నెదుర్కొని దేశాన్ని రక్షించుకొనుటకు జాతీయైక్యత ఒక్కటే దేశ భక్తియుతమైన విధానమని మనం కార్మికుల్లో బాగా ప్రచారంచేసి నచ్చచెప్పగలిగేము. అదికూడ మన యీ విజయానికి చాలవరకు కారణమని చెప్పాలి.

జాతీయ నాయకులు నిర్బంధంలో వుంచబడిన తర్వాత రెచ్చగొట్టబడిన దేశభక్తులూ, పంచమాంగదళమూ కూడ దేశవ్యాపితమైన సమ్మె చేయవలెననీ, వుత్పత్తిలో ప్రతిష్టంభన తేవలెననీ కార్మికుల కుద్బోధించేరు. అప్పుడు మనం ధైర్యంతో యీ కార్యక్రమాన్ని, తత్ప్రచారాన్ని నిరోధించేం. ఈ సమ్మెలు నిరంకుశ ప్రభుత్వాన్ని లొంగదీసి మనకు జాతీయప్రభుత్వం ప్రసాదించుటకు మారు, దానికి పూర్తిగా వ్యతిరేకమైన ఫలితాలను కల్గిస్తాయని గట్టిగా చెప్పేము. సమ్మెలు దేశరక్షణకు పునాదియైన వుత్పత్తిని పూర్తిగా కుంటుపరచుటే కాక ప్రభుత్వ నిర్బంధ విధానం వలనా, పంచమాంగదళ విధ్వంసక చర్యలవలనా కల్గిన అరాజకాన్ని, విచ్ఛిన్నశక్తులను యెన్నోరెట్లు యెక్కువచేసి యుండేవి. సమ్మెలు మన దేశంమీద దండయాత్రకు సైన్యాల నాయత్తం చేసికొంటూన్న జపాను కెంతో అనుకూలమైన పరిస్థితులను, వాతావరణాన్ని కల్గించియుండేవి.

ఎన్నో సంవత్సరాలుగా మన పార్టీ యొక్క రాజకీయనాయకత్వం క్రింద నున్న కార్మికులు తమ పనులను వదలి లేచిపోలేదు. ప్రతి కార్మికుడూ తన స్థానంలో నిలబడి పనిచేసేడు. ఒకమూల పోలీసు నిర్బంధ విధానం వారిని రెచ్చగొడుతూంది; ఇంకోప్రక్క దేశభక్తి పేరుతో సమ్మెలలో పాల్గొనవలెనని యెడతెగని ప్రచారం వారి నుద్రేకపరుస్తూంది. వారు వీటికో దేనికీ కూడ లొంగిపోక తమ తమ స్థానాల్లో నిలబడి వుత్పత్తిని సాగించేరు.

కార్మికుల్లో వాళ్ళ ఆటలు సాగకపోవడంచేత విధ్వంసకులు మొదటినుంచీ కూడ యజమానుల మీద నాధారపడసాగేరు. యజమానులతో కుమ్మక్కుచేసి లాకౌట్లు (lockouts) చేయించడం. రౌడీగ్యాంగులకు డబ్బిచ్చి వారిచే అల్లర్లు చేయించి వుత్పత్తి ఆగిపోయేలా చేయడం మొదలెట్టేరు.

కాని కార్మికుల సమ్మెలను ఆపుచేయుటద్వారా వుత్పత్తిమీద జరిగిన మొదటి దాడి నెదుర్కొనగలిగేము. తద్వారా దేశమే రక్షింపబడిందంటే అతిశయోక్తి కాదు. మనమే పూనుకోకపోయినట్లయితే, మనదేశ పారిశ్రామిక వ్యవస్థ

అంతా పూర్తిగా— రాకపోకలమార్గాలతో సహా— భస్మీపటలమైపోయి యుండేది. నాటి క్లిష్టపరిస్థితులలో మనం చేసిన కృషి చాల గర్వింపదగిన విషయం.

జాతీయ సంక్షోభం వెనువెంటనే ఆహార సంక్షోభం, ఆర్థికసంక్షోభం తీవ్ర రూపంలో ప్రత్యక్షమయేయి దాంతోటి అనేకచోట్ల సమ్మెలు జరిగేయి. మన కృషి మూలంగానే ఆ సమ్మెలు దేశవ్యాపితం కాకుండా ఆగేయి. డిసెంబరు 1942, ఫిబ్రవరి 1943 మధ్య కాలంలో యీ పరిస్థితి అతి తీవ్రరూపం దాల్చింది. ఆహారం కోసం, కరువుభత్యాల కోసం అనేక సమ్మెలు జరిగేయి. యుద్ధోత్పత్తి చేస్తూన్న రైల్వే కర్మాగారాలలో, బట్టల మిల్లుల్లో, ఇంజనీరింగు కర్మాగారాల్లో, నౌకానిర్మాణ శాలల్లో, ట్రాం సర్వీసులలో సమ్మెలు జరిగేయి. వెనుకబడియున్న (Backward) పరిశ్రమల్లోని కార్మికులూ సమ్మెలు చేసేరు; నిర్మాణంగల నవీన పరిశ్రమల్లోని కార్మికులూ సమ్మెలు చేసేరు. ఎక్కడ చూసినా సమ్మెలే. ఇదీ, డిసెంబరు—ఫిబ్రవరి మధ్యకాలంలో మనల నెదుర్కొన్న కష్టదశ.

నిజంగా పరిస్థితి చాలక్లిష్టంగా వుందనడంలో సందేహంలేదు దేశభక్తుల క్రోధ జ్వాలలు కల్గించలేకపోయిన దుష్ఫలితాలను—పరిశ్రమలన్నీ బందైపోవుటను—ప్రభుత్వంయొక్క దివాలాకోరు ఆర్థికవిధానం కార్మికులను నిరాశకు లోనుగావించి తెంపరిచర్యలకు పురిగొల్పుటద్వారా సాధిస్తుందా అనిపించింది. మన దేశభక్తియుక్తమైన పంథావల్లనూ, ట్రేడ్‌యూనియన్ల వల్లనూ మాత్రమే అట్టి దారుణ పరిస్థితి యేర్పడకుండా ఆగింపనడంలో యేమీ సందేహంలేదు.

క్రామ్మేడ్సు, రేల్వేబోర్డు కరువుభత్యాన్నివ్వ నిరాకరిస్తూన్న సమయంలో, రైల్వే వర్కుషాపులో సమ్మె బయలుదేరుతూన్నపుడు, దేశవ్యాపితమైన రైల్వే కార్మికుల సమ్మె జరగకుండా ఆపుచేసిందెవరు? మనమే: ఎస్. ఐ. ఆర్. మొదలైన పెద్ద రైల్వేయూనియన్లను నడిపించే మనమే, ఇతర యూనియన్లను ఇతరుల సహకారంతో నడిపించే మనమే, అటువంటి సమ్మె రాకుండా చేసేం. రైల్వేకార్మికు లందరిలో మనకి గొప్పపలుకుబడి ఉంది కనక సరిపోయిందికాని లేకపోతే దేశంలో ప్రతిచోట సమ్మెలు చెలరేగియుండేవి. ఆ ప్రవాహాన్ని మనమే ఆపేము. ప్రభుత్వం అవలంబిస్తూన్న ఆత్మవినాశకరమైన పంథాకు వ్యతిరేకంగా, దేశరక్షణకు మూలమైన ఉత్పత్తిని కొనసాగింపవలసిన ఆవశ్యకతను కార్మికులకు నచ్చచేప్పేం. వారి నుత్తేజితులనుచేసి ఉత్పత్తికి పూనుకొనేటట్లు చేసేం.

సమ్మెలు జరగకుండా ఆపుచేసేం; సమ్మెలు జరుగుతున్నచోట్లల్లా కలుగ చేసుకొని వెంటనే వాటిని పరిష్కరించేం; వివాదము యున్నచోట్ల పరిష్కారం అయ్యేవరకూ సమ్మెల నుపసంహరించేం.

మన కృషి ఫలితంగా సమ్మెలు వ్యాపించకుండా ఉండడమే కాక, "పని నష్టమయిన దినాల" సంఖ్యకూడ తగ్గింది. సమ్మెలు చాల తక్కువకాలం జరిగేయి; చాలవరకు అవి చిన్న అల్లర్లుమాదిరిగానే ఉండిపోయేయి. ఆర్థికపరిస్థితులు కార్మికులను ఎంతో రెచ్చగొడుతూన్న సమయంలోకూడ ఉత్పత్తికొరకు వేలకొలది పనిరోజులను కాపాడగలిగేం; లక్షలకొలది కార్మికులను వారి వారి స్థానాల్లో ఉంచి ఉత్పత్తి నిర్విఘ్నంగా కొనసాగేటట్లు చేయగలిగేం.

దానికంతకూ కారణం? మన దేశ రక్షణకొరకు కార్మికులు 24 గంటలూ పనిచేయవలసిన యీ సమయంలో చీటికి మాటికి బాధ్యతారహితంగా సమ్మెలు చేయుట దేశ వినాశానికే మార్గమౌతుందని మనం గుర్తించగల్గడమే.

కలకత్తా నగరంమీద జపానుబాంబులు కురిపించినపుడు అక్కడ ఉత్పత్తి, రాకపోకలు సరిగా నడిచేటట్లు చేయుటలో మనం చాలావరకు విజయంపొందేం. జపాను అనుకూలురైన పంచమాంగదళ దేశద్రోహులు ప్రజల్ని భీతావహుల్ని చేయుటకూ, ఉత్పత్తి-రాకపోకలూ బందైపోయేటట్లు చేయుటకూ తమ శక్తి కొలదీ బ్రహ్మాండమైన ప్రయత్నాలు చేశారు. కాని, ఇంజనీరింగు, ట్రాంవేకార్మికుల్లో అధికభాగం తమతమ స్థానాల్లో ధైర్యంగా నిలబడి తమకర్తవ్యాన్ని నిర్వహించేరు. కమ్యూనిస్టుల నాయకత్వం క్రింద దేశభక్తి పూరితులైన ట్రాంవే కార్మికులు విమానదాడులు జరుగుతూన్నపుడుకూడా అసమాన ధైర్యంతో ట్రాములను నడిపించేరు; రాకపోకలు బందైపోకుండాచేశారు; కలకత్తా ప్రజలలో తమ ఆదర్శ కృషివలన ఉత్తేజంకల్గించేరు; వారి నైతికశక్తిని (Morale) కాపాడేరు.

కామ్రేడ్స్! మన దేశంలోని ఏ యితర పార్టీకూడ యీ (ఉత్పత్తి) రంగంలో యిటువంటి సేవచేసేమని చెప్పుకోజాలదు; చెయ్యలేదుకూడా. అన్ని పార్టీలలోను మనం ఒక్కరమే మన దేశరక్షణ సమస్యను చాల సీరియస్‌గా తీసుకున్నాము. అందుచేతనే (సరిహద్దులోని దుర్గాన్ని రక్షించినట్లుగానే) ఉత్పత్తిని యెంతో ప్రాణప్రదంగా కాపాడేము.

# కార్మికవర్గం మనపాలసీ నంగీకరించింది

మన పాలసీ — సమ్మెలురాకుండాచేసి ఉత్పత్తిని కొనసాగించుట, సమ్మెలను వెంటవెంటనే పరిష్కరించుట - వలన కార్మికులకు కల్గిన ఫలితాలేమిటి? దీనివలన జాతీయోత్పత్తికొరకు కార్మికుల అవసరాలు, ప్రయోజనాలు బలియివ్వబడినాయా? దీనివలన సంఘటితశక్తి అనేదే పూర్తిగా దెబ్బతిన్నదా? ముఖ్యముగా కార్మికులు మన కార్యక్రమాన్ని అంగీకరించారా లేక త్రోసిపుచ్చేరా?

ఆర్థిక అసంతృప్తివలన బయలుదేరిన సమ్మెల ప్రవాహం ముందు మనం నిలబడలేమనీ, మనపార్టీ యీ దెబ్బతో కార్మికుల విశ్వాసాన్ని కోలుపోయి పూర్తిగా వారికి దూరమైపోతుందనీ మన ప్రత్యర్థులు, శత్రువులు యెన్నో కలలు కన్నారు.

కాని వాస్తవానికి జరిగిందేమిటి?

మనచే నిర్మించబడిన ట్రేడ్ యూనియన్లలోని సభ్యులసంఖ్య 1943 లెనిన్ డే, మే డేల మధ్యకాలంలోనే 2 లక్షలనుండి 3 లక్షలవరకు పెరిగింది.

1942 ఆగస్టునుండి ఈ సంఖ్యలను పరిశీలిస్తే కార్మికోద్యమంలోని యీ అభివృద్ధి మరీ స్పష్టంగా కనుపిస్తుంది.

మన ట్రేడ్ యూనియన్ సభ్యత్వం ఒక లక్షకుపైగా పెరిగిందంటే అర్థం ఏమిటి? "ఉత్పత్తిని కొనసాగించాలి. సమ్మెలేకుండా రాయబారాలద్వారానే తగాదాలను పరిష్కరించుకోవాలి" - అనే మన పార్టీ పాలసీ కార్మిక సామాన్యానికి అంగీకృతం అయిందన్నమాట. సమ్మెలుతప్ప మార్గాంతరం కన్పించని పరిస్థితులలో, సమ్మె ప్రవాహం కార్మికలోకాన్నంతనీ ముంచెత్తేరోజుల్లో మనం ఇంతమందిని మన పాలసీవైపుకు ఎలా ఆకర్షించగలిగాం? ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని ఏవిధంగా ఇంతగా అభివృద్ధిచేయగలిగాం? ఈ మన సరియైన పంథాలో నడవడంమూలంగా కార్మికులకెన్నో సౌకర్యాలను సంపాదించగల్గాం; వారి వుద్యమాన్ని ముందుకు తీసుకపోయేం; దానితోటి కార్మికుల దురవస్థలు కొంతవరకు తగ్గినాయి; కార్మికునికి తన సంఘశక్తిమీదనూ, ఉద్యమంమీదనూ విశ్వాసం బలపడింది. మనం కార్మికులహక్కులను రక్షించుటకే వారి యున్నతికే పనిచేస్తున్నామనే విశ్వాసం యెక్కువయింది.

కామ్రేడ్స్! ఈ రంగంలో మన విజయాలను, మన కృషి ఫలితాలను మనలో చాలమంది చాల తక్కువ అంచనా వేసేము. సమయానికి వలసిన సౌకర్యాలను - కొన్ని సమయాల్లో ఇవి చాల సంతృప్తికరంగా ఉన్నాయి - సంపాదించి పెట్టుట మూలంగా ఉత్పత్తి రంగం పటాపంచలై పోకుండా చేసేము. ఆ సౌకర్యాలను సంపాదించలేకపోతే ఉత్పత్తిని కొనసాగించటం చాల కష్టసాధ్యమై యుండేది. కార్మికులనందరినీ ఐక్యపరచి ఏకబాటను నడిపించుటద్వారా నిరంకుశాధికారులయొక్క, యజమానులయొక్క ప్రతిఘటనను కొంతవరకు ఛేదించగలిగాం.

మన పాలసీవలన కార్మికుల దైనందిన హక్కులను, కోర్కెలను కాపాడటమేగాక, వారికి కొన్ని సౌకర్యాలను కూడ సంపాదించాము. ట్రేడ్ యూనియను సంస్థలను సంపూర్ణ వినాశనంనుండి, విచ్ఛిత్తినుండి తప్పించి కాపాడాం. తప్పుడు పంధా అయిన ఉత్పత్తి వ్యతిరేక విధానాన్ననుసరించి ఉండినట్లయితే, ట్రేడ్‌యూనియన్ ఉద్యమం పూర్తిగా నాశనమయేది. మన పాలసీద్వారా పాత యూనియన్ల పునాదులను విస్తరింపజేసి పెద్ద పెద్ద "మాస్ యూనియన్లను" (ఎస్. ఐ. ఆర్; ఎం. ఎస్. ఎం. రైల్వే యూనియన్లవంటివి) నిర్మింపగల్గేము. కొత్త యూనియన్లను స్థాపించి, కార్మికుల సంఘశక్తిని, నిర్మాణశక్తిని పెంపొందించాము.

కార్మికులయొక్క తమ హక్కులను, ప్రయోజనాలను కాపాడుకొనే శక్తిని యెక్కువచేశాం: వారి సంస్థలకు బలం చేకూర్చాం; ఇంతవరకూ వెనకబడి, ఎట్టి నిర్మాణంలేని కార్మికులను వారివారి సంస్థలలో సంఘటితపర్చాము. ఉత్పత్తి ఆగిపోకుండా చేయుటకు అతి దీక్షతో పనిచేశాం. కనుకనే పంచమాంగదళ ప్రచారానికి లోనుగాకుండా, ఆర్థిక రాజకీయ పరిస్థితులమూలంగా రెచ్చగొట్టబడకుండా పనిజేశాం. కనుకనే పై విజయాలను సాధించగల్గాము.

## మన ప్రధానమైన లోపం

కామ్రేడ్స్! పైన చెప్పిన విజయాలను పరిశీలిస్తే మనలోపం కూడా స్పష్టంగా తెలుస్తుంది. ఇంతవరకూ మనం చేసినది ఉత్పత్తిమీద చేసిన దాడుల్ని ఎదుర్కోవడం మాత్రమే. ఉత్పత్తి పడిపోకుండాను, ఆగిపోకుండాను చేసింది

తప్పితే మనం పొందిన విజయ మేమీలేదు. దేశరక్షణలో ఉత్పత్తియొక్క ప్రముఖస్థానాన్ని గుర్తిస్తే ఫాసిస్టు దండయాత్రాభయం నానాటికీ ఎక్కువౌతున్న ఈ రోజుల్లో మనం ఇంతవరకు సాధించిన దానితో సంతృప్తిపడి ఊరుకోవడానికి వీల్లేదు. ప్రమాద పరిస్థితులింకా తొలగిపోలేదు. వెంటనే మనం నడుములు బిగించి కార్యరంగంలోకి దూకవలసి యుంటుంది.

మనం దెబ్బకాచుకొనే స్థితిలోంచి దాటేమని గట్టిగా చెప్పలేకుండా ఉన్నాం. "ఉత్పత్తి నెక్కువచేయడం మా విధి; అది ప్రతి కార్మికునియొక్క దేశభక్తియుతమైన కర్తవ్యం" అని గుర్తించి, ఉత్పత్తిలో చొరవను తమ చేతిలోకి తీసుకొనేటట్లుగా కార్మికులను నడిపించలేకపోయాం. ఏ పరిశ్రమలోనూ కార్మికులు ఉత్పత్తిలో చొరవను తమచేతిలోకి తీసుకోలేకపోయేరు. ఈ విషయంలో మాత్రం మనం పూర్తిగా అపజయం పొందేమని గుర్తించాలి. దాన్నిగురించి గట్టిగా ఆలోచించి ముందు కర్తవ్యాన్ని నిర్ణయించుకోవాలి.

ఈ రోజున ఉత్పత్తిని నిర్మాణయుక్తంగా కొనసాగించడం, ఎక్కువ చేయడమే ట్రేడ్‌యూనియన్ల రాజకీయ కర్తవ్యం. ఉత్పత్తిని నిర్మాణయుక్తంగా కొనసాగించడం ద్వారానే; యజమానులూ, ప్రభుత్వం కల్పించే అడ్డంకులను దాటుటకు కార్మికుల శక్తినీ, చొరవనూ పెంపొందించుట ద్వారానే: వివిధ మార్గాల్లో ఉత్పత్తి నెక్కువచేయుటకు ప్రజోద్యమాలను నిర్మించుటద్వారానే; ట్రేడ్‌యూనియన్లు మన దేశరక్షణలో తమపాత్రను నిర్వహించగల్గుతాయి. ఉత్పత్తి రంగంలో మనం సాధించిన ప్రతి విజయమూ, కార్మికుల చొరవ మూలంగా హెచ్చుగా ఉత్పత్తి చేయబడ్డ ప్రతి పారిశ్రామిక వస్తువూ (ఒకొటా) జపాన్ గుండెల్లో ఒక్కొక్క గుండుదెబ్బ; దేశస్వాతంత్ర్య సంపాదనలో ఒక ముందడుగు—అనే చైతన్యం ట్రేడ్ యూనియన్ ఉద్యమం పరిధిలో నున్న ప్రతి కార్మికునిలోను కలగాలి. అట్టి చైతన్యమే కల్గించలేనినాడు మన పాలసీలో అర్థంలేదు; పటిమాలేదు మన నాయకత్వంక్రింద వున్న కార్మికవర్గం ప్రభుత్వమూ, యజమానులూ అవలంబించే పాలసీవలన వుత్పత్తిలో కలుగుతూన్న అరాజకాన్ని రూపుమాపుటకు బద్ధకంకణులు గావాలి; ఈ అరాజకత్వం మన యావద్భారత జాతిని మహాప్రమాదంలో ముంచుతుందని, ప్రజల కింతకన్న ప్రబలశత్రు వుండబోదని గుర్తించాలి. ఉత్పత్తిని సాగించే బాధ్యత తమ చేతు

ల్లోకి తీసికోవడం తమ దేశభక్తియుతమైన విధియని కార్మికులు గుర్తించాలి. బట్టలు, బొగ్గు మొదలగువాని కొరతవలన సామాన్యప్రజలు పడుతూన్న ఘోర మైన యిబ్బందులు వారిని కదల్చివేయాలి; ఈ యిబ్బందులు తొలగించే ప్రజా రక్షకులుగా వారు ముందుకు రావాలి; వచ్చి ప్రతి శ్రామికుడూ తన శక్తికొలది తన దేశానికి ప్రజలకు సేవజేయుట కెల్లప్పుడూ సంసిద్ధుడేయని ప్రజా సామాన్యా నికి భరవాసా యివ్వాలి.

ఇందులోనే వుంది కార్మికుల దేశభక్తి. ఉత్పత్తి చేసేవారి దేశభక్తి తమ పనిని నిర్విఘ్నంగా కొనసాగించుటలోనే వుంది. ఇదియే మన పాలసీని మన వర్గానికి తీసికెళ్ళి నచ్చచెపుతూంది.

ఉత్పత్తిలో ప్రతికార్మికుడూ చొరవతీసికొని పనిచేయుట అనేది ముఖ్యంగా ఒక రాజకీయ బాధ్యత—దేశరక్షణ పోరాటంలో ఒక ముఖ్యభాగం. ఆ రాజ కీయ కర్తవ్యాన్ని నిర్వహించే సాధనం ట్రేడ్‌యూనియన్ వుద్యమం. కార్మిక వర్గ సైన్యం యీ బాధ్యత నిర్వర్తింపవలసియుంది.

ట్రేడ్‌యూనియన్లలో అతి బలీయమైన శక్తిగావున్న మనమీద ఒకప్రత్యేక బాధ్యతకూడా వుంది. కార్మికవర్గాన్నంతనూ వుత్తేజపరచి దేశరక్షణ కొరకు వుత్పత్తిని నిర్మాణయుక్తంగా కొనసాగించుటకుగాను వారు ముందు కురికేలా చూడాలి.

ఇక్కడే మన ప్రధానమైన లోపం కన్పిస్తూంది. ఉత్పత్తికి వ్యతిరేకంగా విధ్వంసకచర్యలు జరపరాదని కార్మికులకు నచ్చచెప్పాం. వాటిలో పాల్గొనకుండా చేశాం. నిజమే. కాని మన కార్మికుల్లో వుత్పత్తియెడల దేశభక్తియుతమైన దృక్పధాన్నిగాని, ఒక నూతన ఆచరణకు వుత్సాహాన్నిగాని గల్గించలేకపోయాం ఇంకా కార్మిక సామాన్యంలో వుత్తేజం కలగలేదు.

ఉత్పత్తి నెక్కువజేయుటకు ఉత్పత్తి మహాసభలనుగాని (Mass rally), ప్రజా ప్రదర్శనాలనుగాని జరపలేదు. సామాన్య కార్మికులందరను అత్యధి కోత్పత్తి చేసేవారిగా ప్రోత్సహించుటకు యేమీ వ్యక్తిగత ప్రయత్నాలు జరగ లేదు. దేశ రక్షణకొరకు వుత్పత్తి నెక్కువచేయుటకుగాను ప్రజలను నడిపించే చొరవను శ్రామికులింకా చూపించుటలేదు.

మన నాయకత్వంక్రింద కార్మికులు పంచమాంగదళ ప్రచారానికి లోను గాక వుత్పత్తిని కాపాడేరు. విధ్వంసక చర్యలకు దిగలేదు ఈ దుర్భర ఆర్థిక పరిస్థితులనుండి తప్పించుకునేందుకు యీనాడు సమ్మెచేయుట సరియైన మార్గం కాదని వారు గుర్తిస్తున్నారు. అయినప్పటికీ ఉత్పత్తికీ దేశరక్షణకూ గల అతి దగ్గర సంబంధాన్నిగాని, అందులో వారికి గల బాధ్యతనుగాని వారు సరిగా గ్రహించలేకపోతున్నారు.

# 3

## మన లోపాలకు రాజకీయ కారణం

ఈ మన అపజయానికి మూలం రాజకీయంగా మనం, దేశరక్షణలో తన ప్రత్యేక బాధ్యతను నిర్వహించుటకు కార్మికవర్గాన్ని కదిలించలేకపోవడమే.

రాజకీయరంగంలో దేశరక్షణ యెంత ముఖ్యమో, ట్రేడ్ యూనియను రంగంలో వుత్పత్తి అంత ప్రధానమైనదని గుర్తించినపుడే యిదెంత ప్రమాద కరమైన లోపమో తెలుస్తుంది.

ఆ లోపాన్నలాగే వుంచామంటే అర్థంయేమిటి? ఫాసిస్టు వ్యతిరేకపోరా టాన్ని - ట్రేడ్‌యూనియనురంగంలో దేశరక్షణ పోరాటాన్ని వొదిలిపెట్టేమన్న మాట. మన పార్టీయొక్క ప్రధానమైన రాజకీయ నినాదాన్ని ఆచరణలో విడ నాడేమన్నమాట. నేటి జాతీయ అంతర్జాతీయ విముక్తి యుద్ధంనుండి కార్మిక వర్గాన్ని వేరుచేసి దూరంగా వుంచామన్నమాట

ఐక్యత, దేశరక్షణలకొరకు కార్మికవర్గాన్నంతనూ ఏకోన్ముఖంగా వుత్తే జితులనుజేసి కదలించలేకపోయామనే విషయాన్ని ఒప్పుకుతీరాలి. జాతీయైక్యత, దేశరక్షణలకొరకు ప్రజలనందరినీ కదలించలేకపోవుటకు కారణములైన కొన్ని ముఖ్యమైన తప్పుడుపంథా (Deviation) లను రాజకీయ తీర్మానం నిర్మొహమా

టంగా చూపిస్తూంది. ఈ తప్పుడు పంథాలే ట్రేడుయూనియను రంగంలో యింకా యెక్కువ బలంగా వ్యక్తమైయుండాలి.

ఏది యెలావున్నా కార్మిక వర్గంలో మనకెంలో పలుకుబడి యున్నప్పటికీ, ట్రేడ్‌యూనియను వుద్యమం యెంతో బలపడినప్పటికీ కూడ మనం దేశరక్షణావశ్యకతను కార్మికులు గుర్తించేలా చేయలేకపోయామనే విషయాన్ని పార్టీలోని ప్రముఖ ట్రేడుయూనియను నాయకులుకూడ ఒప్పుకుంటారు. "దేశరక్షణ కొరకు జాతీయైక్యత" అనేది ఇప్పటికీ వారి యుద్ధ నినాదంకాలేదు. దేశస్వాతంత్ర్యానికి, అభివృద్ధికి యిదే యేకైక మార్గమనే చైతన్యం వారిలోయింకా కలగలేదు. దానికొరకు వుత్సాహంతో పోరాడుటకు, తమ సర్వస్వం త్యాగం చేయుటకు వారింకా ముందుకు రావడంలేదు.

ఏమిటి దీనికంతకూ కారణం?

మొదటిది: మన రాజకీయ తీర్మానం ఖండించిన అతివాద జాతీయ తప్పుడు పంథా. దానిమూలంగా మనం దేశరక్షణ సమస్యను వుత్సాహంతో వారి ముందుంచి వారికి నచ్చచెప్పి, తమ సర్వస్వాన్ని స్వదేశ రక్షణకొరకు త్యాగం చేసేటంత చైతన్యం కార్మికుల్లో కలిగించలేకపోయాం.

మన రాజకీయ ప్రచారంలో నిరంకుశాధికారులను విమర్శించడంతోనే సరిపోయింది అది కారణంగా "జాతీయైక్యత-రక్షణ" కార్యక్రమాన్ని స్పష్టంగా సూటిగా ప్రజలముందుంచలేకపోయాము. అది మన దృష్టిని పూర్తిగా అసలు విషయాన్నుంచి మరలించివేసింది. దేశరక్షణనినాదాన్ని వారి ముందుంచేటప్పుడు 'చిటగాంగులో మన సోదరప్రజలపై ఆస్తులపై జపానుబాంబులు పడుతున్నాయి. గ్రామాలకు గ్రామాలు భస్మీపటలమై పోతున్నాయి" అనే విషయాలను చెప్పడం కూడ మరచిపోతున్నారు మన కామ్రేడ్సు తరుచుగా. కలకత్తామీద జపాను దాడులు జరిగితే చాలాచోట్లప్రజలకు చీమకుట్టినట్లయినాలేదు. ప్రజల్లో చైతన్యమే వుంటే జపాను సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దేశభక్తియుతమైన బ్రహ్మాండమైన ప్రదర్శనాలెన్నో జరిగియుండవలసింది. కాని అదికూడా మామూలుగా రోజు జరిగే సామాన్య విషయంలాగే తీసికొన్నారు ప్రజలు.

జపానుపేస్తూన్న దుండగాలను వున్నదివున్నట్టుగా వర్ణించినప్పటికీ దేశభక్తుల హృదయాల్లో జపానుయెడల ద్వేషాన్ని వ్యతిరేకతను రగుల్కొల్పగల్గి యుందుము. మన దేశరక్షణ చేసికొనకపోతే ఆదుర్గతే మనకూ పడుతుంది సుమా అనే విషయాన్నికూడ వారిచే గుర్తింపజేయ గల్గియుందుము. కాని నిజానికి మనం జపాను వ్యతిరేక భావాలనుగాని, ఫాసిస్టులయెడల విద్వేషాన్నిగాని వారిలో రగుల్కొల్పలేకపోయాము.

ఇవన్నీ యిలావుండగా పరిస్థితులయొక్క తీవ్రతనుగాని, సత్వర దండయాత్రాభయాన్నిగాని కార్మికులు గుర్తించేలా చేయలేకపోయాం. ఈ తప్పుడు పంథాలు మనల నెంతదూరం తీసుకుపోయాయంటే అగస్టు 9 తర్వాత వుత్పత్తిని యధాప్రకారంగా సాగించిన కార్మికుల దేశభక్తియుతమైన చర్యను సువర్ణాక్షరాలతో లిఖించి ప్రచారం చేయలేము మనం. పైనుంచి జపానుబాంబులు కురుస్తున్నప్పుడుకూడా యధాప్రకారం ట్రాములు నడిపించిన కలకత్తా ట్రామ్వే కార్మికుల అఖండ త్యాగదీక్షను, దేశభక్తిని మిగిలినవారందరికీ ఆదర్శంగా ప్రచారం చేయలేకపోయాం.

తాము సాధించిన విజయాల గొప్పతనాన్ని కార్మికులే సరిగా గుర్తించలేదు. స్వాతంత్ర్య పోరాటానికి ద్రోహంచేసిన నీచులుగా కార్మికులను దేశభక్తులు నిందింపసాగారు. మన నాయకత్వంక్రింద ఆ కార్మికులంతా తమ తమ పనులను వదలిపెట్టక వుత్పత్తిని కాపాడారు. కాని యీ దుష్ప్రచారం రోజురోజుకీ అధికమై వారిలో నిస్పృహ, నిరాశ, అధైర్యం కల్గించసాగింది.

వారు వుత్పత్తిని కాపాడుకొనుటలో తమ దేశాన్నే రక్షిస్తున్నారనీ, వారు తమతమ స్థానాలను విడిచిపెట్టకుండా వుండుటద్వారానే గొప్ప ప్రశంసార్హమైన పనిచేశారనీ వారికి బోధించవలసిన బాధ్యత మనది. సరిగ్గా దానినే మనం విస్మరించాము. మన కాంగ్రెస్ దేశరక్షణ, విధ్వంసక చర్యలు - యేవో గాలికబుర్లు పరస్పర సంబంధం లేనివిగా (Abstract) భావించుటే దానికి కారణం.

సమ్మెలకు ప్రోత్సహించే వారికీ, గూండాలకూ వ్యతిరేకంగా, యజమానుల లాకౌట్లకు వ్యతిరేకంగా వుత్పత్తిని నిర్విఘ్నంగా కొనసాగించుటకు కార్మికులు సాగించే యెడతెగని పోరాటంయొక్క రాజకీయ ప్రాముఖ్యతను వారికి సరిగా చెప్పలేము. చైతన్యంతో వుత్పత్తిని కొనసాగించుట దేశరక్షణ చేయుటే

అనే విషయాన్ని వారికి సరిగా చెప్పలేదు. పంచమాంగదళాన్ని తరిమివేయుటకు కార్మికులుచేస్తున్న పోరాటాన్నే పునాదిగాచేసికొని జాతీయైక్యత, దేశరక్షణ, అధికోత్పత్తుల కొరకు కార్మికులందరను సమీకరించుట జరగలేదు.

నిరంకుశాధికారులు, యజమానులూ అవలంబిస్తూన్న పాలసీవలన దిన దినమూ దారుణరూపందాలుస్తూన్న వుత్పత్తిసంక్షోభాన్ని (Production crisis) తొలగించుటలో కార్మికులదే అతి ప్రధానమైన పాత్ర అనేది వారికి నచ్చచెప్ప బడలేదు.

అందుచేతనే అగస్టునుండి నేటివరకూ - ఈ సమయంలో కార్మికులెన్నో వ్యతిరేక శక్తుల నెదుర్కొని వుత్పత్తిని కాపాడారు - కలిగిన అనుభవం అంతా కూడా కార్మికులు వుత్పత్తిని పునర్నిర్మించి, అధికం చేయుటకు చొరవ తీసు కొనేటట్లు చేయలేకపోయింది.

మన దేశానికి ఫాసిస్టు దండయాత్రవస్తే యెటువంటి ఘోరాలు జరుగు తాయో కార్మికులు గుర్తించాలి. రష్యా, చైనా, అమెరికా, బ్రిటన్ ప్రజలతో చేయి చేయి కలిపి, మన మాతృభూమిని రక్షించుటకు ప్రజలనందరను ఐక్య పరచే కార్యక్రమంలోనే మన దేశ స్వాతంత్ర్య పోరాటం ఇమిడియున్నది అనే సత్యాన్ని అతడు గ్రహించేటట్లుగా అతడిలో దేశభక్తిని రగుల్కొల్పాలి. అలా చేయగల్గిననాడుగాని కార్మికుణ్ణి తనపాత్ర నిర్వహణచేసేలా ఉత్తేజపరచుట కష్టం.

ఏవిధంగా దేశరక్షణకు ఉత్పత్తి మూలస్తంభమో, నేడు ఉత్పత్తిలో బయల్దేరిన సంక్షోభం దేశ రక్షణనంతనూ ఏవిధంగా భగ్నంచేస్తూందో అతడు గ్రహించేలా చేయాలి. ఉత్పత్తి యంత్రాన్ని నడిపించేతనే ఈ సంక్షోభం రాకుండాచేసి దేశాన్ని రక్షించగలడనే విషయాన్నికూడా కార్మికుడు గ్రహించేలా చేయాలి. దేశాన్ని మహోపద్రవం యెదుర్కొంటూందన్న చైతన్యమూ, దేశ భక్తీ - ఇవి రెండూ వున్ననాడే కార్మికుడు ఉత్పత్తి నధికం చేయడానికి ఉత్సాహంతో ముందుకు వస్తాడు.

ఈనాడు అతని జీవిత పరిస్థితులు దుర్భరంగా వుంటున్నాయి. అతడి వెనుకటి అనుభవం ఏమి చూపిస్తూంది ? అతడు పనిలో యెంత నేర్పు చూపినా సరే అదంతా యజమానికే వుపయోగించింది. ఆ లాభం అంతాకూడా యజ మానే దోచుకొన్నాడు. హోరాహోరీ పోరాడితేతప్ప యజమానిదగ్గరనుండి

ఎటువంటి సౌకర్యమూ పొందలేకపోయాము. ఇక ప్రభుత్వమా? తన దేశాన్ని ప్రజల్ని దోచుకొని తన హక్కుల నపహరించే పరాయి ప్రభుత్వం. ఈ పరిస్థితులన్నిటినీ మనస్సులో వుంచుకోవాలి. వీటిలో ఏదీకూడ అతడిని అధికోత్పత్తికి ఉత్సాహపరచేవిగా లేవు.

ఇక రెండోప్రక్క ఈ అయిష్టతను పోగొట్టి వారిలో ఉత్సాహం కల్గించడానికి మనం వారిలో కల్గించే జపాన్ వ్యతిరేకత, ఉగుల్కొల్పే దేశభక్తిమాత్రమే సాధనాలు. అతనిలో యీ భావాలను కల్గించి ఉత్పత్తి నెక్కువచేయుటలోనే స్వాతంత్ర్య సంపాదనా కార్యక్రమంకూడ యిమిడివున్నదనీ, తనయొక్క, తన దేశంయొక్క విముక్తికి అవే ఏకైకమార్గాలని అతడు గుర్తించేలా చేయాలి.

రాజకీయంగా దేశరక్షణకొరకు అతనిని కదలించలేకపోయామంటే, దేశరక్షణ, జాతీయైక్యతా నినాదాలను వేలకొలది హృదయాల్లో ప్రతిధ్వనింపజేయలేకపోయామంటే అర్థంయేమిటి? అతనిని అధికోత్పత్తికొరకు, దేశరక్షణలో అతనియొక్క, ట్రేడ్ యూనియనులన్నిటయొక్క ప్రధానకార్యమైన వుత్పత్తికొరకు - కదలించలేకపోయామన్నమాట. మొత్తానికి చొరవ నిరంకుశాధికారుల, యజమానుల చేతుల్లోనే వుండిపోయింది; ఉత్పత్తిలో సంక్షోభం తీవ్రతరమైంది. దేశరక్షణ ప్రమాదంలో పడింది; దానినెదుర్కొనుటకు మనల నశక్తులనుగా చేసింది; మనం గట్టిగా యేమీ చెయ్యలేకుండా చేసింది.

## ఉత్పత్తిని గురించి తప్పు ప్రచారం
## (Production Wrongly Put.)

దానిమూలంగా 'ఉత్పత్తి' కార్యక్రమాన్ని కార్మికులముందుకు గొనిపోయినపుడుకూడా దానికి దేశరక్షణతోగల అతి సన్నిహితసంబంధాన్ని మరచిపోయి సైన్యంయొక్క, ప్రజలయొక్క అవసరాలకు ఉత్పత్తికీగల సంబంధాన్ని వొదిలిపెట్టేసి, వట్టి ఆర్థిక సమస్యగా, టెక్నికల్ విషయంగా మాత్రమే దానిని వారిముందుంచేరు.

ఈ రకమైన Appeal కి తగిన సానుభూతి రాలేదు. అక్కడితో ఉత్పత్తి వ్యవహారాన్ని నిరాశతో వదిలేసి దానికి మాటల్లోమాత్రం సానుభూతి చూపుతూ

సమ్మెలు రాకుండా చేయడంతోనే సంతృప్తిపడి పూరుకున్నారు. లేకపోతే అధి కోత్పత్తి డిమాండును యితర ఆర్థిక కోర్కెలతో జతపరచి కార్మికుల ముందుం చేరు. కాని అందులోకూడా ఆ యితర ఆర్థికకోర్కెలకే ప్రాధాన్యతనంతా యిస్తూ 'అధికోత్పత్తి'ని వట్టి జీపరహితమైన దానిగా వారిమీద రుద్దారు.

వారిలో దేశభక్తిని పురిగొల్పుట పోయింది; జాతీయైక్యత, దేశరక్షణల కొరకు కార్మికుల నుత్తేజపరచుట పోయింది; 'అధికోత్పత్తి' అనే గాలిమాట మాత్రం - ఇతర ఆర్థిక డిమాండుతో జతపరచి - మిగిలింది.

ఈ ఆర్థిక కోర్కెలను ముందుంచిన విధానం చూస్తేకూడా, "ఉత్పత్తి నెక్కువ చేయమంటున్నాంకదా, దానితోబాటు యివికూడా పెట్టకపోతే దాని నసలే ఒప్పుకోరేమో" అనేభయంతో చేసినట్లే కన్పిస్తూంది. మనం యజమానులతో లాలోచీ అయేమని కార్మికులు దురభిప్రాయ పడతారేమో అనేభయంతో మన కార్యక్రమేద్సు యీ ఆర్థిక కోర్కెలను మన నిజాయితీకినిదర్శనంగా భవిస్తున్నారు. దీనికంతకూ మూలకారణం "ఉత్పత్తిపాలసీ"లో విశ్వాసం లేకపోవుటే, మన ప్రధాన దేశరక్షణ విధానంనుండి దీనిని పూర్తిగా వేరుచేయడం మూలాన్నే యీ అధైర్యం, అవిశ్వాసం బయల్దేరింది.

మన ఈ ప్రచారంవలన కార్మికుల్లోకల్గిన మొత్తం ఫలితాలేమిటి? 'రేపు ఫ్యాక్టరీలో అందరికన్నా బాగా పనిచేయాలి, అనే భావమైనా వారిలో కల్గిందా? యేమీలేదు. తనకు తన కూలితోనేతప్ప వుత్పత్తితో యేమీ సంబంధంలేదు, అనే భావం అతడిలో మునుపటికన్న యెక్కువగా పాతుకు పోయింది.

మనవర్గాన్ని రాజకీయంగా కదలించలేక చివరకు 'ఉత్పత్తి' నెక్కువ చేయాలి, అని వూరికే చిలకపలుకుగా పలుకుతున్నారు. లేకపోతే దానిలోని రాజకీయ ప్రాధాన్యతనే వదలివేసి దానికి వట్టి ఆర్థిక స్వరూపాన్నిస్తున్నారు.

ఉత్పత్తిదారులుగా - స్వేచ్ఛకొరకు దేశరక్షణకొరకు వుత్పత్తిదారులుగా - తమ ప్రధాన రాజకీయ కర్తవ్యాన్ని నిర్వహించకుండా చేస్తున్నది యిదొక కారణం.

## ఆర్థిక కోర్కెలు షరతులుగా తయారయాయి

కామ్రేడ్స్! మనలో కొందరు యేవోకొన్ని షరతులమీదనే ఉత్పత్తిని కొనసాగిస్తామనే అతివాద జాతీయ దృక్పధాన్ననుసరించడంలో ఆశ్చర్యం యేమీ లేదు. క్రమంగా ఆర్థిక కోర్కెలను ఉత్పత్తి నెక్కువచేయుటకు ముందు అంగీకరించాల్సిన షరతులుగా ముందుకు తెచ్చాము. అంటే బాహాటంగా వాటిని షరతులుగా పెట్టేమనికాదు. కాని వారికోర్కెలు అంగీకరింపబడితేనే తప్ప ఉత్పత్తి అధికమవదని కార్మికులతో చెప్పినపుడు వారు తమ కోర్కెలకే ప్రాధాన్యత యిస్తున్నారు. మనం వారిలో అధికోత్పత్తి కొరకు రాజకీయంగా వుత్సాహాన్ని కల్గించలేకపోతున్నాము. చివరకు ఫలితం ఆర్థికకోర్కెలు షరతులుగా మారి బిగుస్తున్నాయి.

ఇంతకన్న ఆందోళనకరమైన పరిస్థితి వుందా? "మాకు మొదట జాతీయ ప్రభుత్వం యివ్వండి; తర్వాత మా దేశాన్ని రక్షించుకుంటాం" అని మనపార్టీ సభ్యుడెవరైనా అంటే మీ రేమి సమాధానం యిస్తారు? "నువ్వు నీ మాతృదేశాన్ని రక్షించుకోడానికి షరతుపెడ్తున్నావు. నీ దేశంయొక్క వునికి, స్వాతంత్ర్యం మహాప్రమాదంలో వుంటూంటే నీవు బేరాలకు వెడుతున్నావు; ఇది యెంతమాత్రం దేశభక్తి కాదుసుమా. మన జాతీయనాయకత్వం అవలంబించిన తప్పు పంథాయే—మనదేశాన్ని సంక్షోభానికి గురిగావించిన తప్పు పంథాయే—నీవు కూడ అవలంబిస్తున్నావన్నమాట" అంటారు.

అనుకోకుండానే మనం వుత్పత్తిరంగంలో సరిగా యిదే విధానంలోకి దిగజారేము. ఉత్పత్తినుండి వేరుచేసి ఆర్థికకోర్కెలను ముందుంచేము. సహజంగా అధికోత్పత్తి చేయుటకుముందు షరతులుగానే అవి కార్మికులకు కన్పిస్తున్నాయి. కొన్నిషరతులమీదనే దేశరక్షణలో పాల్గొనుట అనే పాలసీని మనం రాజకీయరంగంలో తిరస్కరించేము. కాని సరిగ్గా దాన్నే మనలో కొందరు వుత్పత్తిరంగంలో అంగీకరిస్తున్నారు. మన ప్రధాన సూత్రాంనుండి దూరంగా పోతున్నామని యికనైనా గుర్తించాలి. మనం యీ విధానాన్నే అనుసరించినట్లయితే చొరవంతా పూర్తిగా సిరంకుశాధికారులు, యజమానుల చేతుల్లోకి పోతుంది.

# పాతదృక్పథం వొదలకుండా వుంది

మన ప్రచారంకేసీ, ఆందోళనకేసీ, మనంపెట్టిన ఆర్థిక కోర్కెలయొక్క ఫలితాలకేసీ ఒకమారుచూస్తే మన కార్మికవర్గమంతా తమ దృక్పధాన్ని పూర్తిగా మార్చుకుంటేనేతప్ప ఉత్పత్తిరంగంలో మంచి ఆర్గనైజర్లుగా తయారవరనే విషయం స్పష్టమౌతుంది.

ఈనాడు మనం ఆర్థిక కోర్కెలకొరకు యేవిధంగా ఆందోళన చేస్తున్నాం? ఆ కోర్కెలు సబబైనవా, కావా, మనం యేకోర్కెలను పూర్తిగా బలపరుస్తున్నాం? జాతి అంతతోబాటు రాజకీయంగా ముందుకు పోవుటకు తగిన అవకాశాలను కార్మికులకు యేకోర్కెలు కల్గిస్తాయో అట్టి ఆర్థిక కోర్కెలకొరకు మనం ప్రతి దశలోనూ ఆందోళన చేసేం. తద్వారా జాతి అంతకు మళ్ళీ యింకో ముందడుగువేసే అవకాశం కల్గించేము. మనదృష్టిలో ఆర్థిక కోర్కెలు జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో వొక ప్రధానభాగం; అంటే అది అందరియొక్క సామాన్యాశయమైన స్వాతంత్ర్యం కొరకు జాతీయైక్యతను నిర్మించుటకు కార్మికులకూ, ప్రజలందరకూ కూడ సహాయకారిగా వుండాలి.

చివరకు పెట్టుబడిదారీ విధానం పూర్తిగా నాశనమై ఉత్పత్తిసాధనాలు సంఘపరం చేయబడిననాడు తప్ప కార్మికులను దోపిడీచేయడం సంపూర్ణంగా తొలగింపబడదని మనకు తెలుసు. అయినా సామ్రాజ్యవాద యుద్ధదశలోగాని, అంతకు ముందుగాని యీ డిమాండ్సును వెంటనే గుర్తించవలసిన కోర్కెలుగా మనం యెన్నడూ పెట్టలేదు. పైగా మన డిమాండ్సు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మనం సాగించే జాతీయ ప్రజాస్వామ్య విప్లవదశకు తగినవిగానే వున్నాయికూడాను. " కార్మికులకు కనీసజీతం యేర్పరచాలి: రోజుకు 8 గంటలు మాత్రమే పనివుండాలి " మొదలైన వాటినిమాత్రమే కోరేము.

దీనివలన కార్మికులకోర్కెలు సబబైనవి, న్యాయమైనవి అని రుజువైంది. వాటికొరకు జరిగిన ఆందోళన జాతీయపోరాటంలో సమ్మిళితమైపోయింది. ఆ సరిహద్దులకు లోబడియే దోపిడీ విధానానికి వ్యతిరేకంగా కార్మికుల అవసర పోరాటాలన్నిటినీ జరిపేము.

ఈ నాడు పరిస్థితులన్నీ పూర్తిగా తారుమారయేయి. మనదేశ స్వాతంత్ర్యం దేశరక్షణమీద ఆధారపడియుంది. కార్మికులేకాదు మనజాతి అంతయొక్కయు వునికి యీనాడు ప్రమాదంలో వుంది. "ఐక్యతాబలంతో దేశరక్షణ, దేశరక్షణ ద్వారా దేశ స్వాతంత్ర్యం, అదే యీ నాడు సరియైన పంథా.

దేశరక్షణ కొరకు జాతీయైక్యత (కావాలి)

దేశరక్షణకొరకు జాతీయప్రభుత్వం (కావాలి)

జపాను నెదుర్కొని దేశాన్ని రక్షించుటకు కాంగ్రెసు నాయకులు విడుదలవాలి.

ఈ నాడు మన ప్రతి నినాదమూ, ప్రతి కోరికా ఒకటే పరీక్షకు నెగ్గాలి: అది మన దేశరక్షణను బలపరచి దానికి సహాయం చేస్తుందా? లేదా? మనదేశ రక్షణకుగాను మనప్రజల నైక్యపరచుటకు తోడ్పడుతుందా లేదా అనేదే ఆ పరీక్ష.

వెంటనే నెరవేర్చబడాలి అని మనం పెడుతూన్న ఆర్థిక కోర్కెలుకూడ యీ పరీక్షకు— అవి మన జాతీయ ప్రతిఘటనను బలపరచి యెక్కువచేయుటకు తోడ్పడుతాయా అనే పరీక్షకు— నిలబడి నెగ్గాలి. అపుడే అవి సరైన డిమాండ్సుగా పరిగణింపబడతాయి. దీనినే ఉత్పత్తిరంగాని కన్వయిద్దాం. కార్మికుల శక్తి నెక్కువచేసి దేశాని కత్యధికోత్పత్తి చేసేలా తోడ్పడే డిమాండ్సునే మనం బలపరుస్తున్నాం. వాటి కొరకే ఆందోళనచేస్తున్నాం. కార్మికుల పరిస్థితులు బాగు పరచాలి. కూలి యెక్కువచేయాలి మొ॥ కోర్కెలను మనం యీ కారణంచేతనే బలపరుస్తున్నాం. మన పార్టీ డాక్యుమెంట్లలో ఉత్పత్తి నెక్కువచేయుటకు కార్మికులకు జీతాలు పెంచాలి. అని మనం వ్రాసేమంటే అదొక షరతుగా పెట్టడం కాదని గ్రహించాలి.

కార్మికుల తక్షణ కోర్కెలను యింకోదానికి— జపాను నెదుర్కొని దేశాన్ని రక్షించాలి అనేదానికి— సమన్వయ పరుస్తున్నామన్నమాట. కాని దీని ప్రాముఖ్యత చాలమంది గ్రహించనేలేదు.

ఈ రోజున దాని అర్థమేమిటి? ఇప్పుడు కూడా మనం తప్పకుండా కార్మికుల సౌకర్యాల నెక్కువచేయాలని జీవిత వ్యయంతోపాటు వారి జీతాలుకూడ

యెక్కువ చేయాలనీ, ట్రేడ్‌యూనియన్లు గుర్తింపబడాలనీ ఆందోళన చేస్తాము. ఆందుచేతనంటే ఇవన్నీకూడ కార్మికుల శక్తి నెక్కువచేసి అధికోత్పత్తి ద్వారా దేశరక్షణలను బలపరుస్తాయి; మన జాతిని అభివృద్ధిమార్గాన ముందుకు తీసుకు పోతాయి కనక.

ముఖ్యంగా యీ విషయాన్ని కార్మికులు కూడా గుర్తించాలి. వారందరిలో వున్న దేశభక్తికి మన ప్రచారం తోడై యీ క్లిష్టపరిస్థితిలో దేశం కార్మికులకు విధించిన కర్తవ్యం వుత్పత్తి నెక్కువచేయుటే" - అని వారికి బోధించాలి; తమకు విధించిన కర్తవ్యాన్ని యెన్నికష్టాలకూ లెక్కచేయక జయప్రదంగా కొనసాగిస్తేనే తమ హక్కులను, కోర్కెలను జాతి అంతా గుర్తించేలా చేయగలుగుతారనీ వారికి తెలియజెప్పాలి. తమపని తాముచేసినపుడే యెక్కువ జీతాలు, ఇతర సౌకర్యాలు అడగడానికి వారికి హక్కుకలుగుతుందనీ, అపుడే వారు తమ జాతి అంతటోబాటు కలిసి ముందుకు సాగుతారనీ వారికి తెలియజెప్పాలి.

"కార్మికుల శక్తి నెక్కువచేయుటకుగాను వారి కెక్కువ సౌకర్యాలు కల్పించాలి" అనే నినాదం వట్టి అర్థశూన్యమైన చిలకపలుకు కాదు మనదృష్టిలో. మన ఆందోళనా కార్యక్రమంలో, ప్రచారంలో, వుపన్యాసాల్లో, కరపత్రాల్లో యెప్పుడూ "కార్మికులు తమ పాతదృక్పథాన్ని వదలాలి" అని బోధించాలి. "వుత్పత్తిని కొనసాగించుట మా దేశభక్తియుతమైన కర్తవ్యం; అధికోత్పత్తి ద్వారానే మా దేశానికి సేవజేయగలం; ఈనాడు మేం వున్న దుర్బలపరిస్థితుల నుండి తప్పించుకుని మా కోర్కెలను సాధించుటకు అదియే మహాయుధం" అనే దృక్పథాన్ని, వుత్సాహాన్ని వారిలో కల్గించాలి.

ఈ విధంగా అయితేనే కార్మికుల ఆర్థిక కోర్కెలకూ, ఉత్పత్తి దేశరక్షణలకూ సరియైన సమన్వయం కుదురుతుంది. ఏకకాలంలో, ఉత్పత్తిని నిర్మాణయుక్తముగా కొనసాగించుటకూ, కార్మికుల పరిస్థితులను చక్కజేయుటకూ యిదే మార్గం.

## మన ఆందోళన కార్యక్రమం (Our agitation)

ఆర్థిక కోర్కెల కొరకు మనంచేసే ఆందోళనలో దేశరక్షణయొక్క, ఉత్పత్తియొక్క అవసరాలను గురించి తగిన ప్రాధాన్యత యివ్వడంలేదు; వూరికే పాతపంథాలోనే నడిపిస్తున్నాం. ఆర్థిక కోర్కెలను దోపిడీచేసే యజమానులకూ, పీడితకార్మికులకూ మధ్య సమస్యగా మాత్రమే చూస్తున్నాం. లేకపోతే ఆ పోరాటం కార్మికులకు వ్యతిరేకమైన విదేశప్రభుత్వ విధానంపై సాగించే పోరాటంగా నైనా పరిగణిస్తున్నాము. ఉత్పత్తి సమస్యయొక్క ప్రాధాన్యత— దాని యెడల కార్మికుల బాధ్యత — వీటిని గట్టిగా నొక్కి చెప్పుటలేదు. ఎన్ని ఆటంకాలు వచ్చినా, ధైర్యంతో కొనసాగించవలసిన ఉత్పత్తిలో యీ ఆర్థిక కోర్కెలు ఒకభాగం మాత్రమే అనే విషయం మరచిపోతున్నాము.

అందుచేతనే నిరంకుశాధికారులు, యజమానులు యీ ఆర్థిక కోర్కెల నంగీకరింపక పోవుటనుబట్టి దేశరక్షణకు, అధికోత్పత్తికి కూడ వారు వ్యతిరేకులే అని బుజువౌతున్నా, మనం ఆ విషయం గుర్తించుటలేదు. మన న్యాయమైన కోర్కెలను కూడా వారు వ్యతిరేకిస్తున్నారే అనే దృక్పథంతో చూస్తూ మన కోర్కెలను వెనుకటి తప్పు ప్రచారవిధానాలద్వారానే నెరవేర్చుకోవాలని చూస్తున్నాం.

'లాభాల' సంగతి చూద్దాం. జీతాలు పెంచాలనే మన ఆందోళనలో యీ 'అధిక లాభాల' నే విధంగా యెదుర్కొంటున్నాము? యజమానులు— కార్మికులు—వీరిద్దరూ మాత్రమే పార్టీలనీ, యీ లాభాలన్నీ కార్మికులను దోచుకున్న ఫలితమేననీ అంటున్నాము. మొత్తం దేశానికి, జాతి అంతకీ కూడ ముంచుకు రానున్న ప్రమాదాన్ని— బానిసత్వంలో కూలద్రోసే జపాను ప్రమాదాన్ని—గుర్తించుట లేదా అనిపిస్తుంది. పారిశ్రామిక రంగంలో ఐక్యప్రతిఘటనా విధానం నిరుపయోగమా అనే సందేహం కలిగించేలా వుంది మన ప్రవర్తన.

మనరాజకీయ పంథాకనుణ్యంగానే లాభాలను దేశరక్షణ యుద్ధంలో అందరూ సమాన త్యాగాలను చేయవలసి 'యుంటుంది' అనే దృక్పథంనుండి యెదుర్కొని విమర్శించవచ్చును. ఎక్కువ జీతాలడుగుట న్యాయమైన కోర్కెయే యని చెబుతూనే అది వారికీ, యజమానులకూ మాత్రమే సంబంధించిన విషయం

కావనీ, తమ దేశంమొత్తానికీ, శత్రువుకూ మధ్య సమస్యఅనీ, కార్మికులు గుర్తించేలా చేయవచ్చును. యజమానుల అధికలాభాలు గుంజుకొనేపద్ధతి శుద్ధస్వలాభ ప్రేరితమనీ, జాతీయతా వ్యతిరిక్తమనీ వెల్లడిచేస్తూ, కార్మికులది దేశభక్తియుత మైన కార్యక్రమం అని ప్రజలకు నచ్చచెప్పవచ్చును.

మన ప్రచారం, చేసే ఆందోళన యెలావుండాలంటే, "మనం తక్షణ కోర్కెలకొరకు సాగించే యీ పోరాటాలన్నీకూడా దేశరక్షణ కొరకు, అధికోత్పత్తి కొరకు జరిగే మహా పోరాటంలోని చిన్నభాగం మాత్రమే అని కార్మికులు గ్రహించేలా చేయగలగాలి. ఈ చిన్నపోరాటం పెద్దదానిమీదనే ఆధారపడి యుంటుందనే విషయాన్నికూడా గుర్తింపజేయాలి.

ఈ ఆర్థిక కోర్కెలకొరకు జరిగే చిన్నపోరాటం యజమానులకూ-కార్మికులకూ మధ్యగానీ, బాధ్యతా రహితంగా వర్తించే నిరంకుశాధికారులకూ-కార్మికులకూ మధ్యగాని రేగే ప్రత్యేక సమస్యమాత్రమేకాదనీ, దాని పరిష్కారం వారి వారి బలాబలాల ప్రదర్శనవల్ల - సమ్మెరూపంలో - జరగవలసినది మాత్రమే కాదనీ వారు గుర్తించాలి. అధికోత్పత్తి పోరాటంలో యిదొక అంతర్గత పోరాటం కనక కార్మికులు నిర్మాణయుక్తంగా అధికోత్పత్తి చేయుటద్వారానే ఈ తక్షణ పోరాటంలో జయిస్తారు; అల్లా కాకుండా, యజమానులు నిరంకుశాధికారులూ అవలంబించే ఉత్పత్తినిరోధక విధానమే వీరూ అవలంబిస్తే తమ పోరాటంలో జయంపొందలేరు. కార్మికుల ఈచిన్నకోర్కెలుకూడ నిరాకరించబడుతున్నాయంటే యేమిటి? తమ దోపిడీ విధానాన్ని ఇతోధికంగా కొనసాగించుటకేదాక, కార్మికుల శక్తిని కుంటుపరచుటద్వారా దేశరక్షణను జాతీయోత్పత్తిని విచ్ఛిన్నం చేయుట కూడా యజమానుల ప్రయత్నం అన్నమాట. ఈ పరమ సత్యాన్ని కార్మికులు గుర్తించిననాడు, వారు యీరోజున సాగించే ప్రతి చిన్నపోరాటమూ కూడా స్వార్థపరాయణులైన యజమానులొకప్రక్క (ప్రభుత్వమద్దతుతో) ప్రజానీకమంతా రెండోప్రక్కావుండి సాగించే పోరాటమని వారికి స్పష్టపడుతుంది. అప్పుడే వారు సమ్మెలు మొదలైన విచ్ఛిన్న చర్యలనుంచి విరమిస్తారు. అధికోత్పత్తి నిర్మాణంలో ఐక్యతద్వారా వారు చూపించే చొరవ, వారికి ప్రజలు చూపించే సానుభూతి సహాయాలు — నిజంగా వీటివల్లనే తమ కోర్కెలు నెరవేరుతాయనే విషయంకూడా వారు గుర్తిస్తారు.

కాని మనంచేసే ఆందోళన, ప్రచారమూ యింకా పాతపంథాలనే నడుస్తున్నాయి. దేశరక్షణతో, అధికోత్పత్తితో సంబంధంలేకుండా ఆర్థిక కోర్కెలను వేరుచేస్తున్నాము; వాటిని యజమానుల - కార్మికుల మధ్య, లేదా నిరంకుశాధికారుల - కార్మికులమధ్య పరిష్కరింపబడవలసిన సమస్యగానే పరిగణిస్తున్నాము; ప్రచారంలో కూడ వెనుకటి నినాదాలను జోరుగా ప్రయోగిస్తున్నాము; ఒక్క సమ్మెచేయించడం మినహాగా మిగిలినదంతా పాతపంథాయే.

మనం ప్రచారవిధానాన్ని ఆందోళనకార్యక్రమాన్ని, నూతనపరిస్థితుల కనుగుణంగా మార్చుకోలేకపోయేము. తక్షణ ఆర్థికకోర్కెలను దేశరక్షణ అధికోత్పత్తులకు సమన్వయం చేయలేకపోయేము. కార్మికులు తమ పాతదృక్పథాన్ని వదలిపెట్టలేకుండుటకు, అధికోత్పత్తి కొరకు చొరవను తమచేతిలోకి తీసికొనలేకుండుటకు యిదే ఒక బలీయమైన కారణం.

## దాని పర్యవసానం యేమిటి ?

ఈ పాత దృక్పథం తప్పక సమ్మెలకు మాత్రమే దారితీస్తుంది. ఈనాటి దుర్భర ఆర్థిక పరిస్థితుల్లో "ఉత్పత్తిని కొనసాగించవలసిన బాధ్యత మనమీద వుంది" అనే విషయం కార్మికుడు స్పష్టంగా గ్రహిస్తేనే అతడు ఉత్పత్తినిరోధక మార్గంనుండి తప్పుకుంటాడు, అధికోత్పత్తికి తోడ్పడతాడు; ఆ చైతన్యం గ్రహింపు యింకా కార్మికునిలో రాలేదు, అతడి ఆర్థిక పరిస్థితులు నానాటికి మరీ దుర్భరం అౌతున్నాయి. ఈ పరిస్థితులకు తప్పుప్రచారం కనకతోడైతే కలిగే ఫలితం ఒకటే, సమ్మెలు - యింకా యెక్కువసమ్మెలు

అందుచేత, కార్మికునిలో రాజకీయచైతన్యం కలిగితేనేతప్ప యీ ప్రస్తుత దుర్భర పరిస్థితులలో తమ కోర్కెలను సంపాదించుటకు సమ్మెలుచేసే పంథాలోనికి దిగజారుతాడు. అధికోత్పత్తికి తోడ్పడే న్యాయమైన డిమాండ్లు కొంకే తాను సమ్మెచేస్తున్నానని, అందులో తప్పులేదనీ అతడనుకుంటాడు. సమ్మెచేయుటవలన తనదేశరక్షణకే, జాతియొక్కవునికికే ముప్పుతెస్తున్నాడనేవిషయం అతడు గుర్తించడు. ఉత్పత్తిమీద దెబ్బతీసి నాశనంచేయుటకు పంచమాంగదళానికి దొక పెద్ద అవకాశమన్నమాట. కార్మికులను రాజకీయంగా అంతులేని సమ్మెలకు పురిగొల్పి పరిశ్రమల్లో ఒక పెద్ద ప్రతిష్టంభన తెచ్చుటకు ప్రయత్నించింది

పంచమాంగదళం; కాని పూర్తి అపజయం పొందింది. దానితో ఇపుడు వుత్పత్తిని నాశనం చేయుటకు చిన్న గెరిల్లాయుద్ధాలు సాగిస్తూంది. కార్మికులనుభవిస్తూన్న దుర్భర పరిస్థితులను ఉపయోగించుకుని సమ్మెలను ప్రోత్సహించి ఉత్పత్తిని విచ్ఛిన్నం చేయబూనుకుంది.

అందుచేత మనం పెటనే మన ప్రచారాన్ని, ఆందోళనను పూర్తిగా మార్చుకొనకపోయినట్లయితే చాల తీవ్రమైన ఫలితాలు కలుగుతాయని గుర్తించాలి; అది సమ్మెలకు దారితీస్తుంది. కార్మికులను వారి దైనందిన సమస్యలకొరకు కోర్కెల కొరకు పోరాడే యోధుల బురఖాలో తయారైన పంచమాంగదళపు విధ్వంసక చర్యలకులోను గావిస్తుంది.

# 4

## సమ్మెలవలన దేశరక్షణకు యెలాదెబ్బ

## ( Our Policy in Reletion to Strikes )

"సమ్మెలు ఉత్పత్తిని అపుచేయుటద్వారా దేశరక్షణకే అపాయం కల్గిస్తాయి, అందుచేత నిర్భయంగా సమ్మెలు చేయుటను వ్యతిరేకించండి. అవి జరగకుండా చూడండి." అని మన రాజకీయతీర్మానం స్పష్టంగా చెబుతూంది.

కాబ్రేడ్సు, ఈ కొన్నినెలలనుండి మనం సమ్మెలు జరగకుండాచేసి, అట్టే పనిదినాలు పోకుండా కాపాడాము. కాని ఉత్పత్తి విధానాన్ని ఆచరణలో పెట్టడంలో మనం చూపిన గందరగోళమే ఈ సమ్మెల సమస్యలోకూడా ప్రతిబింబించింది. సమ్మెలకు వ్యతిరేకంగా మనం నిర్భయంగా నిలబడలేదు. అపుడింకా సమ్మెలే ఆర్థిక ఒత్తిడి (Ec. Pressure) తెచ్చుటకు న్యాయమైన ఆయుధమని, కార్మికుల తక్షణకోర్కెలను పొందుటకది చిట్టచివర కుపయోగించవలసిన ఆయుధమనే భావంతో వున్నాము.

ఇటువంటి మొగమాటపడే పంథాను వదలి కార్మికులను సరిగా నడిపించుటకు ఒక నిర్ణీతపంథాను అవలంబించవలసిందని మన తీర్మానం చెబుతూంది. ఈ నాడు వుత్పత్తి అంతాకూడ మనదేశాన్ని, ప్రజలను రక్షించుటకేనని మనం గ్రహిస్తున్నాము. "ఉత్పత్తి సామ్రాజ్యవాదులది, లేక పెట్టుబడిదారులది, దానితో మనకు సంబంధం లేదు" అని చెప్పే రోజులు వెళ్ళిపోయేయి.

అధికోత్పత్తికొరకు చైతన్యంతో చొరవతీసికొని పనిచేయుట కార్మికుల విధి. అలాంటప్పుడు ప్రజలకూ, సైన్యానికీ సరకులందకుండా చేసేటటువంటి సమ్మెలను, పని ఆగిపోవుటను మనం యెలా సమర్థిస్తాము?

కామ్రేడ్స్ యెట్టి పరిస్థితుల్లోనైనా మనం రంగంలోవున్న సైనికుణ్ణి యేదో డిమాండుకొరకు అస్త్రసన్యాసం చేయమని చెబుతామా? సైనికుణ్ణి యుద్ధరంగం వదలిపొమ్మని మనం కోరం. అలాగే పారిశ్రామిక రంగంలో కూడ కార్మికులు తమ స్థానాలను వదలుటను అంటే సమ్మెలను మనం సమర్థించము.

ఈనాడు ఆహార దోపిడీలు, దొమ్మీలు యెంత విచ్ఛిన్నకారకములో, సమ్మెలుకూడా అంతే. ఎక్కువధరలు సంపాదించుటకు రైతులు పంటనమ్మకుండా దాచుటను మనం అంగీకరిస్తామా లేక, దానికి వ్యతిరేకంగా అతడిలో దేశభక్తిని పురిగొల్పుతామా? అదే విధంగా ఉత్పత్తిని, రాకపోకల మార్గాలనూ ఆపేసి, సైన్యానికీ, ప్రజలకూ వారి ముఖ్యావసరాలను అందకుండా చేయుటను మనం సహించి వూరుకోము.

నిజమే, యజమానులు కార్మికుల యెడల అతికౄరంగా అమానుషంగా ప్రవర్తిస్తున్నారు. కాని దానికి సమ్మెలతో సమాధానం చెప్పడమంటే యెవరో కొందరు స్వార్థపరులైన యజమానుల దుశ్చర్యలకుగాను దేశం అంతనూ శిక్షించడం అన్నమాట.

ప్రతిసమ్మెకూడ రాజకీయంగా మనకొక అపజయమని గుర్తించాలి; ఎందుచేతనంటే కార్మికులకు సమ్మెవలని నష్టాలను, దేశరక్షణ, అధికోత్పత్తియెడల తమ బాధ్యతలను గుర్తించేలా నచ్చచెప్పలేకపోయినపుడే సమ్మెలు జరుగుతాయి.

ఈనాడు సమ్మె కార్మికుల ఆత్మవినాశనానికే దారితీస్తుంది. వారి కోర్కెలు నెరవేరవు సరిగదా, వారిలో చీలికలు తెస్తుంది; అమాయకులైనవారిని పంచమాంగదళ విధ్వంసకుల ప్రచారానికి బలిగావిస్తుంది.

దేశ క్షేమంకొరకు, కార్మికుల తక్షణకోర్కెల సంపాదించుటకు కూడ సమ్మెలు రాకుండా చేయాలి. ఇదే ఆతీర్మానం ఉద్బోధిస్తుంది. ముందు అనుకో కుండానే సమ్మెలు చెలరేగిన చోట్లలో మనం కలగజేసుకొని వుత్పత్తికి భంగం కలగకుండా చేయాలి; అట్లు జోక్యంకలగజేసికొని, అట్టి సమ్మెలవలన వుత్పత్తి నాపివేసి తమకూ, తమదేశానికీ మహావిపత్తు కల్గించే కార్యంనుండి కార్మికులను కాపాడాలి; వారు విధ్వంసకుల బారిపడకుండా కాపాడాలి. సాధ్యమైనంత త్వరలో సమ్మెను వుపసంహరింపజేయాలి. కాని యే పరిస్థితులలోనూ కూడ, యేకుంటి కారణాల చేతనూ సమ్మెలను పొడిగించరాదు. మనం కలగజేసికొనుట జయ ప్రదమైనదా లేదా అనేదాని కొకటే తార్కాణం—"ఎంత త్వరలో సమ్మె నుప సంహరింపజేస్తాము; తమ కోర్కెల సాధించుటకు అసలైన మార్గం తమ ఐక్యతద్వారా అధికోత్పత్తి కొనసాగించుటయేనని కార్మికులకు యెంత త్వరలో నచ్చజెప్పగలము". అనేదానిమీదనే మన విజయం వుంటుంది.

## అనుమానాలు — సమాధానాలు

సమ్మెల విషయంలో యిటువంటి నిశ్చితమైన గట్టివైఖరి నవలంబించి నపుడు- మన వుత్పత్తి పాలసీకి అనుగుణ్యమైన వైఖరి (Stand) యిదొక్కటే అని గుర్తుంచుకోవాలి. మన కామ్రేడ్సుకు ముఖ్యంగా రెండు అనుమానాలు కలుగుతున్నాయి.

ఈ మధ్య వారి అనుభవాలను బట్టి కార్మికులను వరుసగా సమ్మెలు చేయ కుండా ఆపుట సాధ్యంకాదని వారు భావిస్తున్నారు.

రెండోది, ఈ సమ్మెలు రాకుండా చేయడం అంటే కార్మికుల దైనందిన సమస్యలకొరకు, వారి క్షేమంకొరకు పోరాటాన్ని ఆపివేయుట కాదా; రాయిస్టు లకీ, మన పాలసీకి తేడా యెక్కడవుంది? అంటున్నారు.

## ఈ మధ్య మన అనుభవం

ఈ మధ్య మన అనుభవం యెక్కువ మార్గదర్శకంగాలేదు. ఒకవేళ అయినా, అది పూర్తిగా పై అనుమానానికి వ్యతిరేకంగానే వుంది.

మన కామ్రేడ్సు యెన్నో సమ్మెలను పరిష్కరించారు. చాల విజయాలను పొందారు. కొన్నిచోట్ల పరిష్కారంకొరకు రాయబారాలు జరుపుటకుగాను తమ

కోర్కెలంగీకరించబడకముందే కార్మికులను పనిలోకి పోవలసిందని నచ్చచెప్పి సమ్మెలాప బడినాయి.

ఇంతలో యెన్నో వాట్లలో కార్మికులు గత్యంతరంలేక నిరాశతో సమ్మెలకు పాల్గొనుటవలన వెంటవెంటనే సమ్మెలు తయారయేవని అంటున్నారు. కాని దీనికి బలమైన కారణంవుంది. మామూలుగా యజమానుల, నిరంకుశాధికారుల కుతంత్రాల నెదుర్కొనుటకు ఈనాటి రాజకీయ వాతావరణంలో సమ్మె సరియైన మార్గం కాదని కార్మికులకు నచ్చచెప్పాలి. అట్టి చైతన్యం వారిలో కల్గించక వాళ్ళనలా వొదిలివేసి సమ్మెలను పరిష్కరించ బూనుటవల్లనే పై జెప్పిన పరిస్థితి యేర్పడుతుంది. అల్లా చేసినంతకాలం, ఒకసమ్మె పరిష్కారం అయేప్పటికి మళ్ళీ యింకోటి తయారౌతూనే యుంటుంది.

సమ్మెలద్వారా మీ తక్షణకోర్కెలు నెరవేరవు: సమ్మెలు మీ బలాన్ని, ఐక్యతను విచ్ఛిన్నంచేసి యజమానులయెదుట మిమ్ముల నసహాయులగావిస్తాయి. అని కార్మికులకొక సూటియైన హెచ్చరిక గావించాలి. దేశరక్షణచేస్తూన్న సైనిక సోదరుల క్షేమంకోరి, తమ సోదరప్రజల క్షేమంకోరి, వారి అవసరాలను గుర్తించి రాకపోకల మార్గాలను, పరిశ్రమలను కొనసాగించవలసినదిగా వారికి విజ్ఞప్తి చేయాలి.

ఉత్పత్తి నధికం చేయవలసిందని, ఆపవలదనీ మాతృదేశంపేర వారిని కోరాలి-ఇదొక్కటే సమ్మెలు తిరిగి తిరిగి తలెత్తకుండాచేసేమార్గం. "పరిష్కారం మళ్ళీ సమ్మెలు" అనే గుడుగుడు గుంచంలోనుండి బైటపడే మార్గం.

వెనుక యెన్నోసార్లు మనసంఘాలు సమ్మెలువద్దని హెచ్చరికలు చేసేయి. కార్మికులెపుడూ తమ సంఘాల నిర్ణయాల ననుసరిస్తూనే వచ్చారు: యీనాడుకూడా అనుసస్తూనే యున్నారు. కాని వచ్చిన చిక్కేమిటంటే యీనాడుకూడా సమ్మెదేశక్షేమానికి వ్యతిరేకమైనదని, సమ్మెచేయరాదనీ ఆసంఘాలే బల్లగుద్ది గట్టిగా చెప్పలేకుండా వున్నాయి. సంఘనాయకత్వమే అట్టి హెచ్చరిక నిచ్చుటకు సంకోచిస్తూంది. సంఘాలకు కల్గియున్న కార్మికులనైనా సమ్మెచేయకుండా ఆపుట అసాధ్యమని కొందరు కామ్రేడ్సు అనుకోడానికదే కారణం కూడాను.

## దైనందిన కోర్కెలు (Day to day Demands)

ఈ విధానం, కార్మికుల తక్షణకోర్కెలను పూర్తిగా వదలివేయుటకాదా అని ప్రశ్నించే కామ్రేడ్సు కార్మికుల ప్రయోజనాలను కాపాడుటకు సమ్మె సరియైన ఆయుధముని భావిస్తున్నారు. సమ్మెలు చేయకూడదనుట మన ఆర్థిక కోర్కెలను సాధించుటకు మనకున్న యేకైక ఆయుధాన్ని పారవేయుటే అనికూడ వారు భావిస్తున్నారు. సమ్మె చేస్తాముసుమా అనే బెదరింపైన లేకపోతే యజమానులు లొంగిరారు కనక యీ కోర్కెలకు వొప్పుగుంటేనే వుత్పత్తి కొనసాగిస్తాము: లేకపోతే లేదని బెదిరించాలంటారు వారు. కాని తరచి చూస్తే యీ సమ్మె అనే పిస్తోలు యజమానుల మీదికిగాక కార్మికులమీదికే- వారి మాతృదేశం వైపుకే- గురిపెట్టబడిందనే సంగతి తెలుస్తుంది. ఎందుచేతనంటే ఉత్పత్తి ఆగిపోతే దేశ రక్షణే పూర్తిగా భగ్నం ఔతుంది.

ప్రతిసమ్మెకూడా- దానికి కారణ మేదైనప్పటికీ- వుత్పత్తి నాపుజేస్తుంది. అనే సంగతి గ్రహిస్తే యీ గందరగోళాని రవకాశమేలేదు. కాని అది యింకా వుండుటకు కారణం మన వెనుకటి దృక్పథం పట్టుకు వొదలకుండుటే. దాని ప్రకారం కార్మికుల హక్కులను రక్షించుటలో యీ సమ్మెలకు (Direct action) యెక్కువ ప్రాధాన్యత వుంది.

ఐతే ఒక దశలో పనికివచ్చే ఆయుధాలే మరొక దశలోపనికి రాకపోతా యనే విషయం వారు గుర్తించుటలేదు. వెనుకటిదశలో సమ్మెలు జరుపుటవల్లనే గాక కార్మికుల దైనందిన కోర్కెలను సమ్మెలద్వారా రక్షించుట, సమ్మెలను జరుపుట. రాజకీయంగా సరియైన పంథాగనుకనే తద్వారా వారి ప్రయోజనాలను కాపాడ గలిగేము.

ఈనాడు సమ్మెలు కార్మికులను కూడగట్టవు: పైగా వారిలో చీలికలను తెస్తాయి. కనుక వారి ప్రయోజనాలను కాపాడుటకు మనకు కొత్తమార్గాలు, కొత్త ఆయుధాలు కావాలి. ఎట్టి ఆటంకాలనూ లెక్కజేయక ఉత్పత్తిని రాకపో కల మార్గాలను సుశిక్షితంగా నడిపించుటకు కార్మికులు ఐక్యతను నిర్మించి చొరవను తమచేతిలోనికి తీసికొనుటలోనే వుంది ఈ కొత్త ఆయుధం. అంటే వుత్పత్తి నాపుచేయుటలోగాక, వుత్పత్తి యంత్రాన్ని యితోధిక శక్తితో నడిపించుటవల్లనే

కార్మికుల దైనందిన కోర్కెలు నెరవేరుతాయి: వారి ప్రయోజనాలు కాపాడబడతాయి.

## దాన్నెలా సాధించాలి? (How is it done?)

అధికోత్పత్తి కార్యక్రమం, ఆ పునాదిమీద నిర్మితమైన ఐక్యత వీటి వలన యెటువంటి ఒత్తిడి తేవచ్చు?

(1) దేశభక్తియుత కార్యమైన అధికోత్పత్తిని యెంత యెక్కువగా కొనసాగిస్తే, ఆటంకాలన్నిటినీ యెదుర్కొని యెంత యెక్కువ ఐక్యతతో ముందుకు సాగితే అంత జయప్రదంగా, స్పష్టంగా స్వార్థపరులైన యజమానుల, నిరంకుశాధికారుల బూటకం వెల్లడిచేయుటకు వీలవుతుంది. యజమానులు తమ స్వంతలాభాల కొరకు తమ దేశంయొక్క, జాతియొక్క క్షేమాన్ని బలియిచ్చే స్వార్థపరులని తేలుతుంది వారి విధాన వల్ల. అప్పుడు అది కార్మికులకూ-యజమానులకూ మధ్య నిర్ణయింపబడవలసిన సమస్యమాత్రమే గాదనీ, అది స్వార్థపరులైన యజమానులకూ, దేశంలోని యావత్తు ప్రజలకూ మధ్య సమస్య అనీ స్పష్టమౌతుంది. దానివలన కార్మికులు దేశప్రజలందరను తన వెనుక అండగా ఐక్యపోరాటంలో సంఘటిత పరచుటకు సాధ్యమౌతుంది.

(2) అదేవిధంగా, సాధ్యమైనంత వరకూ యెట్టి కన్సెషన్లు యివ్వరాదనే నిరంకుశాధికారవర్గం కూడ ప్రజలనుండి వేరుపడిపోతుంది.

(3) దేశం యెడల మనబాధ్యతను నెరవేరుస్తున్నాము అనే ఉత్తమ చైతన్యం మీద ఆధారపడిన దగుటచేత నది కార్మికులలో ఐక్యతను అంతకంతకు యెక్కువ చేస్తుంది.

(4) ఈ ఐక్యత సామాన్యంగా సమ్మెల్లో కనపడే ఐక్యతకన్న చాల బలీయమైనదీ, చైతన్య పూరితమూ అగుటచే, రాజకీయ చైతన్యం గలవారు మామూలు పంథాలలో తెచ్చే వొత్తిడినంతనూ, కార్మికులు కూడ తెచ్చుటకు వీలౌతుంది.

(5) ప్రజలకొరకు పోరాడుతున్నారు; ప్రజలందరి సహాయం వారివెనుక వుంది: ఎన్ని ఆటంకాలొచ్చినా యెదుర్కొని తమ దేశభక్తియుత కార్యాన్ని నిర్వర్తిస్తున్నారు. అట్టి కార్మికుల కోర్కెల నెవ్వరూ తిరస్కరించలేరు. వారు

తెచ్చే ఒత్తిడి నెదుర్కోలేరు. కార్మికులకు వ్యతిరేకంగా ప్రవర్తించే ప్రభుత్వం కూడ దిగివచ్చి ఆ కలహపరిష్కారానికి కలగజేసికొనక తప్పదు.

ఇందులో పంచమాంగదళాని కనుకూలమైన పరిస్థితి ఉండదు. యజమానుల, నిరంకుశాధికారుల స్వార్థవిధానానికి గురిఅయే అవకాశాలు కూడా తొలగిపోతాయి. కాని తనదేశం కొఱకు ఉత్పత్తి నెక్కువజేయుటకు, క్రమంగా చైతన్యంతో తమ బలాన్నెక్కువచేసి కొనుటకు. ఆ బలంద్వారా తమకోర్కెలను సాధించుటకు గొప్ప అవకాశం ఉంటుంది.

ఇదంతా చాల సులభమైనదని ఎవరూ అనరు. రెచ్చగొట్టడం, శిక్షలకు, ఇతర నిర్బంధాలకు గురికావించడం మొదలైనవి తప్పకుండా ఉంటాయి. కాని. చివరకు యివన్నీకూడ కార్మికునియొక్క అపార కార్యదీక్ష ముందు— సైన్యం కొరకు. ప్రజలకొరకు ఉత్పత్తిని కొనసాగించే కార్మికుని చొరవముందు పటాపంచలై పోతాయి.

సమ్మె చేయడమంటే శతృవుల కనుకూలమైన కార్యక్రమం కొనసాగించడమన్నమాట,

అందుచేత సమ్మెలయెడల మన దృక్పథానికీ రాయిజానికీ ఏమీ సంబంధం లేదు; అది (మన పాలసి) కార్మికుల దైనందిన ప్రయోజనాల రక్షణను వదలిపెట్టుటాకాదు; వారికి యెక్కువ సౌకర్యాలు సంపాదించుటకు అది కార్మికుల మీద, ప్రజలమీద, వారి దేశభక్తిమీద మాత్రమే ఆధారపడుతుంది.

ఇప్పటివరకూ సమ్మెలయెడల మనం అవలంబిస్తూ వచ్చిన సందిగ్ధవైఖరికి మూలం "ఒత్తిడి తేవాలి" అనే అతివాద జాతీయ తప్పుడు పంథాయే. అధికోత్పత్తి. దేశరక్షణ పోరాటాల్లో కార్మికులంతా మన నాయకత్వం క్రింద ముందుకు వచ్చి తమ అర్హస్థానాల నాక్రమించుకోవాలంటే మనం యీ పై సందిగ్ధవైఖరిని పూర్తిగా వదలిపెట్టాలి.

# 5

## రాజకీయేతర భావాలు

కొందరు కామ్రేడ్సు సమ్మెల యెడల మన అసలుపంథాను వదలి, ఎంత పెడమార్గాలు త్రొక్కేరో చూడండి. "సమ్మెలు చెయ్యడం తప్పు" అని అందరకూ తెలుసు. కాని ఎవ్వరూకూడా దానిని దేశరక్షణకు సంబంధించిన రాజకీయ సమస్యగా చేయలేదు.

కార్మికులను సమ్మెలు మానమని చెప్పడంలో కొందరు కామ్రేడ్సు న్యాయశాస్త్రిల సహాయ మపేక్షించేరు—"సమ్మెచేయడం శాసన విరుద్ధం. అందుచేత మీరు వెంటనే పనిలోకి వెళ్ళండి" అని కార్మికులకు సలహా ఇచ్చేరు. దాంతో కార్మికులు సకాలంలో నోటీసులిచ్చి సమ్మెచేయడాని కేమి అభ్యంతరం ఉండదనుకున్నారు.

అలాగే, పోలీసులు దౌర్జన్యం ఉపయోగిస్తారని కార్మికులను భయపెట్టారు. సమ్మెచేస్తే కార్మికవర్గంలో చీలికలేర్పడతాయని చెప్పటానికి బదులు వ్యక్తులపై పోలీసులు దౌర్జన్యం ఉపయోగిస్తారని చెప్పి భయపెట్టారు. ఇంకా కొన్నిచోట్ల సమ్మె రాకుండాచేయుటకు రాజీకార్యక్రమమంతా (Conciliation Procedure) అక్షరాలా అమలుపరిస్తే చాలనుకొని, అదికాస్తా పూర్తిగానే యేదో పెద్ద ఫలితాలు కలగబోతున్నాయని కనిపెట్టుగు కూర్చోడం జరిగింది.

ఇందులో దేనికీకూడా మన విధానంతో సన్నిహితత్వంలేదు. 'ఈనాడు మన ప్రధానసమస్య దేశరక్షణ - అధికోత్పత్తి' అనే పునాదిమీద నిర్మితమైంది మనపాలసీ. వాటిపై యెటువంటి ఫలితాలను కల్గిస్తాయి - అనే దృక్పథంనుండియే మనం సమ్మెలనుచూస్తాము. కాని పై తప్పుడు (Opportunist) వ్యాఖ్యానాలన్నీ కార్మిక వర్గాన్ని మనయొక్క దేశభక్తియుతమైన విధానంనుండి - ఎక్కువ ఉత్పత్తిచేయాలి. బాగా ఉత్పత్తిచేయాలనే కార్యక్రమంనుండి విముఖులను చేస్తాయి.

కార్మేడ్సు! ఉత్పత్తికొరకు, దేశరక్షణకొరకు, స్వాతంత్ర్యంకొరకు మనం ఇప్పటివరకూ ఒకపెద్ద ఉద్యమం సాగించలేకపోటకు కారణం గ్రహించడం సులభమే. ఇప్పుడు రాజకీయరంగంలోకి వలెనే ఒకప్రక్క పంచమాంగ దళంతో పోరాడుతూ జయప్రదంగా ఉత్పత్తిని కొనసాగిస్తున్నా, రెండోప్రక్క మనలో అతివాదజాతీయ తప్పుడుపంథా వివిధరూపాల్లో - కార్మికుల ఆర్థిక డిమాండ్సును కాపాడుటగానో, ఏవోకొన్ని షరతులమీదనే ఉత్పత్తికి తోడ్పడుటగానో, లేకపోతే సమ్మెలయెడల అనిశ్చితపంథా నవలంబించుటగానో, - పొడగట్టింది. పంచమాంగదళ నిర్మూలనంలోనూ, ఉత్పత్తి యథారీతిగా సాగేటట్లు చేయుటలోనూ మనం విజయపరంపరను పొందినప్పటికీ, మనరాజకీయపంథా ఉత్తేజకరంగా కార్మికులలో ప్రచారంచేసి మన వర్గాన్ని దేశరక్షణ, అధికోత్పత్తి కార్యరంగంలోకి దూకించలేకపోవడానికిదే కారణం.

ఉత్పత్తిరంగంలో చొరవను మనచేతిలోకి తీసుకొని ఎదురుదాడిని సాగించలేకపోవడానికిదే కారణం. ఈనాడు మనం ఒకపెద్ద ఉత్పత్తిసంక్షోభంలో చిక్కుకొని యుండుట తత్ఫలితమే. మనలోఉన్న ఈ లోపాలన్నీ సర్దుకొన్నట్లయితే మనలోని బలహీనతలన్నింటినీ తొలగించుకో గల్గుతాము.

## ఆచరణలో మన ఉత్పత్తిపంథా ఎలా ఉండాలి?

ఉత్పత్తిసంక్షోభమును ఒక్క జాతీయ ప్రభుత్వంమాత్రమే తొలగించగల్గుతుంది. అట్టి జాతీయ ప్రభుత్వముమాత్రమే ఉత్పత్తిని సరియైన పద్ధతులమీద నిర్మించ గల్గుతుంది. అయినా ఉత్పత్తిని, రాకపోకల మార్గాలను సరిగా నిర్వహించుటకు, మన పాలసీని ఆచరణలో పెట్టుటకు కొన్ని వెంటనే తీసుకోవలసిన చర్యలను ఈ తీర్మానం సూచిస్తుంది. అవి ఏమిటి?

(1) నూటికి నూరుమందిని కార్మికసంఘాలలో సంఘటితపరచుట. ట్రేడ్ యూనియన్లకు, ఫ్యాక్టరీ, మిల్లుకమిటీలకు రికగ్నిషన్ సంపాదించాలి.

(2) సంయుక్తఉత్పత్తికమిటీలను (Joint production committees) ఏర్పరచాలి.

(3) ఉత్పత్తిమహాసభలను జరపాలి.

# 100% యూనియనిజం

కామ్రేడ్స్ ! మన పాలసీని ఆచరణలో పెట్టుటకు ట్రేడ్‌యూనియన్ ఉద్యమమే ప్రధానసాధనం. ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలహీనంగా ఉడడం అంటే ఉత్పత్తి దేశరక్షణలకొరకు జరిపే పోరాటంకూడా బలహీన పడడమన్న మాట. ట్రేడ్‌యూనియన్ వెలుపలవున్న ప్రతిఒక్క కార్మికుడూ కూడా శిక్షణ పొందవలసిన కొత్తవాడన్నమాట. అతడిదెబ్బ గురితప్పి తోడికార్మికులకూ, మొత్తం ఉత్పత్తికే తగిలే అవకాశం ఉంటుంది.

అందుచేత నూటికి నూరుమంది యూనియన్‌లో చేరుట ఈనాడు ఎప్పటి కన్నా ప్రధానావసరమైంది. ఎందువల్లనంటే, అది లేకుండా పెద్ద ఎత్తున కార్మికు లందరిచే మన పాలసీ నాచరణలో పెట్టించుట సాధ్యపడదు. మొత్తం కార్మిక వర్గమంతా అధికోత్పత్తి కొరకు నడుములు బిగించి ముందుకు రావాలంటే "100% యూనియనిజం" ఒక్కటే సూత్రం. మరిదేనివల్లా ఇది సాధ్యపడదు. ఈ '100% యూనియనిజం' నిర్మించే బాధ్యతకూడ 15 సంవత్సరాలుగా ట్రే. యూ. ఉద్యమాన్ని నిర్మించిన మనమే తీసుకోవాలి. కార్మికులకు మన ప్రబోధం ఇది : "దేశరక్షణకొరకు, అధికోత్పత్తికొరకు, ట్రేడ్‌యూనియన్లలో చేరండి;- చేరి మీ హక్కులను, కోర్కెలను సాధించుకోండి !"

ఈనాడు ట్రేడ్‌యూనియన్ల ద్వారా వర్గైక్యత నెలగొల్పుటలో అర్థం ? అధికోత్పత్తి కొరకు కార్మిక సామాన్యం అంతనూ కదిలించగల్గినవిగా తయా రవాలి ట్రేడ్‌యూనియన్లు; అవి వారిని అధికోత్పత్తి కార్యక్రమంలో ఎప్పటి కప్పుడు ముందుకు తీసుకుపోతూ, తద్వారా వారి కోర్కెలను సంపాదించాలి. అల్లా అయితేనే ట్రేడ్ యూనియన్ ఐక్యత— దేశరక్షణ పోరాటంలో ఒక భాగంగా— సాధింపబడుతుంది.

ఈనాడు కార్మికులు దుర్భరపరిస్థితులకు లోనై కుర్రింగి కృశిస్తున్నారు. జీవితవ్యయం రోజురోజుకీ పెరిగిపోతూంది. ధరలు పెరుగుతున్నాయి, కాని వారికిచ్చే కూలిమాత్రం పెరగటంలేదు. ప్రతిచోట కార్మికులు తగినంత కరువు భత్యం, జీతాలు, బోనస్ వగైరా కోరుతున్నారు. యజమానులయొక్క, ప్రభుత్వం యొక్క పాలసీతో పోరాడి ఈ కోర్కెలను సాధించి కార్మికులను కాపాడవల

సిన బాధ్యత ట్రేడ్‌యూనియన్లది. కార్మికులను "మాస్ యూనియన్" లలో సంఘటితపరచి, వారి కోర్కెలను సాధించుటకు "100% యూనియనిజం,— ఉత్పత్తి కొరకు ఐక్యత"— అనేవి మన మూలసూత్రాలు. ఈ 100% సమీకరణ బలంతోనే మనం సమ్మెలు రాకుండా చేస్తాం.

ట్రేడ్‌యూనియన్లకు, వాటి కమిటీలకు రికగ్నిషన్ సంపాదించుటకు ఇక్కడ ప్రాధాన్యత వుంది. శత్రువును జయించేదానికి, ఎక్కువ ఉత్పత్తిచేయుటకు కార్మికులను సంఘటిత పరచాలంటే ఇవిచాలా మంచి ఆయుధాలుగా ఉపయోగిస్తాయి. మేనేజిమెంటుకీ, కార్మికులకీ మధ్య కలహకారణాలను పోగొట్టుటకూ, పైగా సమ్మెలు రాకుండా చేయుటకూ చాల సహాయపడతాయి.

అయితే ట్రేడ్‌యూనియన్లు ఉత్పత్తినివాగా నిర్మించాలంటే, దానిలోని సభ్యులూ, నిర్మాతలూ యెడతెగని కృషిచేయాలి. కార్మిక సామాన్యానికి మార్గదర్శకులుగావాలి. పార్టీసభ్యులు, ట్రేడ్‌యూనియను నాయకులు, మిలిటెంట్లు అందరూ ఉత్పత్తినెక్కువచేయుటకు చొరవతీసుకోవాలి. రాజకీయ ప్రచారంవల్లా, ఉత్పత్తిరంగంలో తమ ఆచరణవల్లా కార్మికులందరనూ నిపుణులైన పనివారుగా తయారుచేయాలి; తమ శక్తికొలది స్వదేశరక్షణకు తోడ్పడేటట్లు చేయాలి.

వాళ్లు ముఖ్యంగా పనిచేయచలసిన స్థలం ఫ్యాక్టరీ-కర్మాగారం-లేక ఉత్పత్తి యూనిటు. వారి ప్రచారంయొక్కా, ఆందోళనయొక్కా ఫలితాలు అక్కడే తేలుతాయి ; వాటివలన కలిగిన ఫలితాలనుబట్టీ, ఉత్పత్తి సమస్యలను పరిష్కరించుటకు వారు కదల్పగల్గిన కార్మికుల సంఖ్యనుబట్టీ దాని జయాపజయాలు నిర్ణయింపబడతాయి.

రద్దుపోవుటను (waste) తగ్గించుట యెట్లు ? విడిభాగాలను యెక్కువకాలం పనిచేసేలా చేయుటెట్లు ? ముడిపదార్థాలను సంపాదించుట, యెక్కువ వుత్పత్తిని సాధ్యపరచే కొత్తమార్గాలను, పద్ధతులను కనిపెట్టి అభివృద్ధి చేయుటెట్లు ? ఇదే యీనాడు ప్రతీ పరిశ్రమను యెదుర్కొంటూన్న సమస్య. దానితోబాటే పనిలోనికి రాకుండామానివేయుట (Absenteeism) ను, కాలం వృధాపోవుటను తగ్గించాలి ; తమ శక్తినంతనూ వుత్పత్తిలో కేంద్రీకరించేలా కార్మికు

లను వుత్సాహపరచాలి. పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క నేటిపరిస్థితులలో జీతాలు తక్కువ. జీవితపరిస్థితులు దుర్భరంగా వుంటాయి— తన శక్తినంతనూ వినియోగించి మనస్ఫూర్తిగా పనిచేయుటకు కార్మికుని కేవిధమైన ఉత్సాహం (incentive) వుండదనే విషయం ఒప్పుకుతీరాలి: అలాంటి సమయంలో మనప్రచారం వారిలో అటువంటి వుత్సాహాన్నే కనక కల్గించినట్లయితే ఉత్పత్తి అతి త్వరలో యెన్నో రెట్లు యెక్కువౌతుందనడానికి కూడ సందేహం లేదు.

దాని ఫలితాలు రైల్వేలమీద యెలావుంటాయంటే,

(1) మొట్టమొదట ఇంజన్లకూ వాటికీ వుపయాగించే బొగ్గుఖర్చును తగ్గించడం ప్రధానకర్తవ్యం. ఈనాడు బొగ్గు సప్లయి యేమీ సరిపోవడంలేదు: బొగ్గులేక ఫ్యాక్టరీలు మూసివేయబడుతున్నాయి. అటువంటి సమయంలో రైల్వేల్లో మనం మిగిల్చిన ప్రతి బొగ్గుముక్కా కూడా మన దేశరక్షణకు, అధికోత్పత్తికి తోడ్పడుతుందని గుర్తించాలి.

(2) ఇంజన్లు, వాగన్లు త్వరత్వరగా రిపేరు చేయబడతాయి. వాటిసప్లయి చాల తక్కువగావున్న యీ రోజుల్లో దీని ప్రాముఖ్యతను గురించి వేరే చెప్ప నక్కరలేదు.

(3) వాగన్లు వృధాచేయబడకుండా చేయబడుతుంది; వాగన్లలోని ప్రతి అంగుళం ప్రదేశంకూడ పూర్తిగా వుపయోగించుకోవాలి: ముఖ్యంగా వాగన్లు అత్యవసరమైన సరఫరాలకే మొదట వుపయోగపడేలా చూడాలి.

(4) యుద్ధ సామగ్రి, యితర యుద్ధ పరికరాలు, రైల్వే సామానులు మొదలైనవి కర్మాగారాల్లో (workshops) యెక్కువగా వుత్పత్తి చేయబడతాయి.

ఇటువంటి లాభకరమైన ఫలితాలెన్నో కలుగుతాయి.

బట్టల మిల్లుల్లోకూడ యివే సమస్యలు; అధికోత్పత్తికిగల ఆటంకాలన్నిటిని తొలగించుటకు కార్మికులే చొరవను తీసికోవాలి.

నాసిరకపు ముడిపదార్థాలు వుత్పత్తినెంతో తగ్గించేస్తున్నాయి: దారం సప్లయి చాలక మగ్గాలు కొద్దికాలం మాత్రమే పనిచేస్తున్నాయి; మేనేజిమెంటులో అరాజకంవల్ల మిల్లులే పనిచేయకుండా పడివుంటున్నాయి—ఉత్పత్తిలో జరిగే

యీ దుబారానంతనూ వెంటనే పూ_ర్తిగా తొలగించాలి. అపుడే మన అధి కోత్ప_త్తి కార్యక్రమం జయప్రదమౌతుంది.

'ఆబ్సెంటీయిజమ్' (పని యెగవేయుట) ను పోగొట్టుటకు కార్మికులే పూనుకోవాలి: పని కాలంలో కాలం వృథాబుచ్చుటను మాన్పుటకు, ముడిపదార్థాలు వృధాగా రద్దుపోవుటను తొలగించుటకు, ఎక్కువ ఉత్ప_త్తిచేయుటకుగాను తమశ_క్తిని, నైపుణ్యాన్ని అభివృద్ధిచేసుకొనుటకు కార్మికులే చొరవతో ముందుకు రావాలి; ఉత్ప_త్తి నెక్కువచేయుటకు తోడ్పడే కొ_త్తవిధానాలను, నూతన యంత్రాలను, వున్నవాటిలోనే నూతన పద్ధతులను సూచించుటకుగూడ కార్మికులే పూనుకోవాలి.

సాధ్యమైన ప్రతిచోటా మూడు షిప్టు (Shifts) లుగా పనిచేయుటకు అవకాశం కల్గించాలని డిమాండుచేయాలి కార్మికులు. అల్లా అయితే యంత్రాలు 24 గంటలూ పనిచేయుటకు వీలుగావుంటుంది; ఉత్ప_త్తి యెక్కువౌతుంది. ఈ డిమాండు కొరకు వారు ప్రజల సహకారాన్నిగూడ తీసికోవాలి.

ఈ రోజున వారు ముఖ్యంగా నెరవేర్చవలసిన క_ర్తవ్యములలో అతి ప్రధానమైన దొకటుంది; బట్టల వుత్ప_త్తిని, కంట్రోలు స్కీమును విధ్వంసం కాకుండా కాపాడాలి; ప్రతి మిల్లూ పూ_ర్తిగా పనిచేసి ఆ స్కీమును జయప్రదం గావించుటకు తోడ్పడేలా చూడాలి; ఆ స్కీములోనే యేవైనా కొ_త్త సూచనలను చేస్తూ, ఆ స్కీము నమల్లో పెట్టడంలో పొడచూపే సమస్యలన్నిటినీ యెక్కడి వక్కడే పరిష్కారం అయేలా చూడాలి. (దారం త్వరత్వరగా సప్లయిచేయుట మొ॥) అందరికీ సరిపడిన చవకబట్ట వుత్ప_త్తి వుండుటా లేకపోవుటా అనేది, యీ స్కీముకూడా వెనక స్టాండర్డు క్లాత్ స్కీముకి పట్టిన దుర్గతే పడుతుందా లేక యిదైనా జయప్రదంగా సాగి, నూతన అభివృద్ధి మార్గాల్లో నడచి, ఉత్ప_త్తి నెక్కువజేసి ప్రజలందరియొక్క అవసరాలకు సరిపడేలా చవకబట్టను సప్లయి చేయగలదా అనే విషయమూకూడ వారు (కార్మికులు) చూపించే వుత్సాహం మీదనే, తీసికొనే చొరవమీదనే అధారపడియుంటాయి.

ఈ పనంతాకూడా యేదో కొద్ది మొనగాళ్ళు (Shock troopers) కొద్దిమంది పార్టీసభ్యులూ, ట్రేడ్‌యూనియను మిలిటెంట్సూ మాత్రమే చేయలేరనే

విషయానికి వేరే నిదర్శనం అక్కర్లేదు. ఈ ఉద్యమం, (Drive) జయప్రదం కావాలంటే ఆ ఫ్యాక్టరీలోగాని, పరిశ్రమలోగాని పనిచేసేవా రందరూకలిసి పని చేయాలి. కార్మికులందరియొక్క అనుభవాలు, తెలివితేటలు, విషయపరిజ్ఞానం ఒకచోట కలిస్తేనే యెక్కడ యేలోటుందో, యెక్కడ యే ఆటంకం వుందో తెలిసికొనుటకు గాని, వెంటనే వాటిని యే విధంగా సరిచేయవచ్చునో సూచించు టకుగాని వీలవుతుంది. వారందరియొక్క సహకారమూ, పట్టుదలా ఉంటేనే ఆ సూచనల నాచరణలో పెట్టించి, ఆ లోపాలను తొలగించుట సాధ్యపడుతుంది.

ఇతర పరిశ్రమల్లోని కార్మికులుకూడ అదేమార్గా న్ననుసరించి, అత్యం తాచరణీయమైన మార్గంలో ఉత్పత్తి నెక్కువచేయుటకు ముందుకు రావాల్సి యుంటుంది.

మొట్టమొదట. (అభివృద్ధిచెందిన) చైతన్యంగల కార్మికులు (advanced workers) నాయకత్వం వహించి విజిలెన్సు కమిటీలు (Vigilence Committees)ఉత్పత్తి కమిటీలు స్థాపించాలి. ఈ కమిటీలు వెంటనే చేయవలసిన పనేమి టంటే, ఫ్యాక్టరీని విధ్వంసక చర్యలనుండి, పని ఆగిపోవుటనుండి కాపాడుట; మేనేజిమెంటులో వున్న అవకతవకలను, అది చేస్తూన్న తప్పులను నిర్భయంగా బహిరంగపరచాలి; అకారణంగా పని ఆపుచేయుట, పరిశ్రమను దాని శక్తిని పూర్తిగా వినియోగించకపోవుట, తమ స్వంత లాభాలకోసం యజమానులే చేసే విధ్వంసక కార్యాలు మొదలైనవాటిని వెల్లడిచేయాలి; నిర్మాణయుక్తమైన సూచన లను చేయాలి; ఆటంకాలన్నిటినీ, లోపాలన్నిటినీ పైన సూచించినట్లుగా తొలగించాలి.

కాన్ఫరెన్సులు, చర్చలమూలంగా వారికి బోధిస్తూ, ఆచరణద్వారా ఉత్పత్తి నెక్కువచేయుటలో వారికి నాయకత్వం వహిస్తూ, యీ చైతన్యంగల కార్మికులు (Advanced) కొద్ది కాలంలోనే యితరకార్మికులందరనూ వుత్సాహవంతులజేసి తమ పంథాలోని కాకర్షించుకోగల్గుతారు. ఉత్పత్తిని కొనసాగించుట ద్వారానే తమకు మేనేజిమెంటుమీద ఒకవిధమైన పట్టుదొరికిందనీ, అధిక ఉత్పత్తి కార్య క్రమమే తమ ప్రయోజనాలను రక్షించుకొనే మార్గమనీ, తద్వారానే దేశసేవ కూడా చేయగలమనీ కార్మికులు త్వరలోనే, తమ స్వంత అనుభవాలనుబట్టియే

గ్రహిస్తారు ఉత్పత్తి నిర్మాణంలో ముందుకువేసిన ప్రతి అడుగూ కూడ కార్మికుల్లో యెంతో యెక్కువ వుత్సాహాన్ని కలిగిస్తుంది.

## మనల నెదుర్కొనే ఆటంకాలు (Difficulties in the Way)

తప్పకుండా మనం అనేక కష్టాల నెదుర్కొనవలసియుంటుంది. స్వార్థపరులైన యజమానులు కార్మికులు చొరవతీసికొనుటను పూర్తిగా నిరోధిస్తారు; అందులో నాయకత్వం వహించిన వారిని శిక్షించుటకు కూడా వెనుదీయరు. ప్రభుత్వంకి మల్లేనే వాళ్ళకికూడా "కార్మికులు చొరవతీసికోవడం" అంటే మహాభయం: వాళ్ళ దృష్టిలో, ఉత్పత్తి యెక్కువైతే లాభాలు తగ్గుతాయి. కనుక అటువంటిది జరగకుండా చేయుటకు, చొరవ కార్మికుల చేతుల్లోకి పోకుండా చేయుటకు వారికి చేతనైనదంతా చేస్తారు.

ఒక్క ఉదాహరణ మాత్రమే తీసికొందాం. బట్టలమిల్లుల యజమానులు-వీరే వెనుక స్టాండర్డుక్లాత్ స్కీమును నాశనం చేయడానికి కారకులు. వారే మళ్లీ యీనాడు తమ లాభాలు తగ్గుతాయనే భయంతో, బట్టల కంట్రోలు స్కీమును భగ్నం చేయుటకు పూనుకున్నారు— కార్మికుల చొరవను యెంతమాత్రమూ సహించుటలేదు.

ప్రైవేటు పరిశ్రమల్లో కానీండి, రైల్వేలు మొదలగు ప్రభుత్వంచే నడుపబడే సంస్థల్లో కానీండి— వుండే వున్నతోద్యోగులు కూడా అధికోత్పత్తిని వ్యతిరేకిస్తారు, అతడి పాతకాలపు అభిప్రాయాలు, కార్మికులంటే హీనభావం; పైగా యే విషయాన్నీ రాజకీయ దృష్టితో చూడలేడు; అదికాక ఒకపుడు అతనిలో బుద్ధిపూర్వకంగా వుత్పత్తి నాటంకపరిచే పంచమాంగదళపు అభిప్రాయాలు వుంటాయి; తానో పెద్ద నిపుణుడననే అహంకారం; యజమానుల దగ్గర తన బండారం యెక్కడ బయలుపడుతుందో అనేభయం- వీటన్నిటిమూలంగా ఆపెద్ద వుద్యోగస్థు డెపుడూ కార్మికులనుంచి వచ్చే ప్రతిసూచననూ వ్యతిరేకిస్తాడు; వారినుంచి వచ్చే ప్రతి అభివృద్ధికరమైన సూచననూ భగ్నంచేయుటకు ప్రయత్నిస్తాడు. యజమాను లనుకూలంగా వున్నపుడుకూడా యీ సూపర్వైజరీ ఆఫీసర్ల వ్యతిరేకతవలన యీ వుత్పత్తి ప్లానులు భగ్నంకావడం, యజమానులు కూడా కార్మికులకు వ్యతిరేకులవడం జరుగుతూంది. దీనికొక్కటే మందు. కార్మికులు

యేప్పుడూ జాగ్రత్తగావుండి ఆ ఆఫీసర్లువేసే ప్రతియెత్తుకూ యెదురెత్తు వేయడం నేర్చుకోవాలి.

యజమానులు, ఉన్నతోద్యోగులూ మాత్రమేకాదు ప్రభుత్వంకూడ యెంతో వ్యతిరేకతను, అశ్రద్ధను చూపిస్తుంది; కార్మికుల్లో చొరవ అభివృద్ధి చెందుట అంటే (బ్యురోక్రసీ) నిరంకుశాధికారులకు భయం; యజమానులు వుత్పత్తిని కొనసాగకుండా చేస్తారేమో అని వారికి హడలు, అందుచేత యేవుత్పత్తి స్కీములోనూ కూడ యజమానుల కేవిధమైన నొప్పి కలగకుండా చూస్తూంటారు; అందుచేత కార్మికులు చొరవతీసికొని పనిచేయుటకు యజమానులు వ్యతిరేకంగా వుంటేసరి, వారూ దానికి వ్యతిరేకమే; యజమానులంటే భయమేగాక, ప్రభుత్వానికి కార్మికులన్నా భయమే స్వతహాగా. అందుచేత వారికెంతమాత్రం ప్రోత్సాహం యివ్వదు.

కార్మికులయొక్క, ప్రజలయొక్క ఐక్యతద్వారా, ఉత్పత్తి నెక్కువ చేయు కార్యాచరణకు పూనుకొనుటవలననే యీ ఆటంకాలన్నిటినీ దాటవలసియుంది. ఉత్పత్తిని నిర్మించుటకు కార్మికులందరూ దృఢనిశ్చయంతో ముందుకు సాగిననాడు యీ వ్యతిరేక శక్తులన్నీ విచ్ఛిన్నమై తీరుతాయి.

కాని, ఒక విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. యజమానుల, అధికారుల ప్రభుత్వంయొక్క వ్యతిరేకతను, ప్రతిఘటనను తొలగించుటేకాక, మనం వుత్పత్తి నెక్కువచేయుటకు వారి సహకారాన్ని సంపాదించాలికూడాను. ఉమ్మడి వుత్పత్తికమిటీ (Joint production committees) లను కోరే మన నినాదం కూడా ఈ ముగ్గురిమధ్య సహకారం (Tripartite Co-operation) వుండాలంటూంది. అందుచేత స్వలాభాలకోసం ఉత్పత్తిని భగ్నంచేయుటను, విధ్వంసక కార్యాలను నిర్భయంగా బయటపెట్టాలి; కాని అదేసమయంలో యజమానులలోవుండే దేశభక్తిని కదల్చి వారు దేశభక్తియుతమైన పాలసీ ననుసరించేలా చూడాలి; దేశభక్తిగల వున్నతోద్యోగులందరనూ కూడ మనతోచేరి సహకారం చేయుటకు ఒప్పించాలి.

యజమానులనుండి, ఆఫీసర్లనుండీ మనకువచ్చే ప్రతి సహాయమూకూడ, వారిచ్చే ప్రతి సౌకర్యమూకూడ మన దేశభక్తియుతమైన పాలసీకి ఒకవిజయంగా పరిగణించి అటువంటివాటిని మనం సంతోషంతో ఆహ్వానించి స్వీకరించాలి.

మన విమర్శనలవల్లను, వారిని బైటపెట్టుట (Exposure) వల్లను దేశభక్తులైన యజమానులు మనతో సహకారంచేయుట అసంభవంకారాదు. వారినుండి వచ్చిన సహాయాన్నంతనూ బహిరంగంగా అంగీకరించాలి; మన విజయాన్ని అంచనా వేసుకొనేటప్పుడు వారి సహకారానికికూడ దాని అర్హస్థానాన్ని యిచ్చితీరాలి.

ఉత్పత్తి కొనసాగించుట కార్మికులకుమాత్రమే సంబంధించినది కాని అందులో మేనేజిమెంటుకేమీ ప్రసక్తిలేదు" అనుకోవటం చాల తప్పు; ప్రమాదం కూడాను.

## సంయుక్త ఉత్పత్తికమిటీలు (జాయింటు ఉత్పత్తికమిటీలు)

కామ్రేడ్స్! ఉత్పత్తిలో సంక్షోభం తీవ్రతరం ఔతూందనీ, దానిక్కారణం పరిశ్రమలకూ - ప్రభుత్వానికీ, కార్మికులకూ - యజమానులకూ మధ్య సహకారం లేకపోవుటేననీ తెలుసుకున్నాము.

నేటి అరాచకాన్నుండి తప్పించుకుని ఒక నిర్ణీతవిధానాన్ని నిర్మించుటకు యిప్పటివరకూ వివిధవర్గాలు ఐక్యతతో కలసి ప్రయత్నించుటలేదు. ప్రభుత్వం కాని, యజమానులుకాని ఒక్క ప్లానుకూడా—ఉదాహరణకు స్టాండర్డు క్లాత్ ప్లాను—తుదనెగ్గించలేక పోయారు. (Full off a single plan)

యజమానులు, కార్మికులు, ప్రభుత్వమూ కలిసి ప్లానువేసి, దానిని నెగ్గించుటకు ప్రయత్నిస్తేనే తప్ప ఉత్పత్తిని కొనసాగించుటగాని, అధికోత్పత్తి చేయుటగాని సాధ్యంకాదని స్పష్టమే.

'జాయింటు ప్రొడక్షనుకమిటీలు స్థాపించాలి' అనేది ఉత్పత్తిరంగంలో నిర్మాణవిషయాల్లో మన ప్రధాననినాదం. అది మూడుపార్టీలమధ్య సహకారాన్ని, సమన్వయాన్ని కల్గించే నినాదం. అటువంటి సహకారమే లేకపోతే ఒకప్లాను ప్రకారం వుత్పత్తిచేయుట అనేదే అసాధ్యం ఔతుంది. ఆనినాదాన్ని ఆచరణలో పెట్టుటకూడ సులభంకాదు. కార్మికుల చొరవతో, వారి బలంవల్లనే అది ఆచరణలో పెట్టబడాలి. ఈ జాయింటుకమిటీలు పరిశ్రమలయొక్క ఆంతరంగిక వ్యవహారాల్లో కూడ జోక్యం కలగజేసికొంటాయనే భయంతో యజమానులు వాటిని వ్యతిరేకిస్తున్నారు. కార్మికుల్లో చొరవ నెక్కువచేయాలనే అభిలాష ప్రభుత్వానికీ లేదు. ఈమధ్యనే ప్రభుత్వమూ, యజమానులూ కూడ, ఆకమిటీలు

జీతాలవిషయంలోకూడ కలగజేసికోవచ్చునసే మిషతో ఆ కమిటీలను నిరాకరించారు.

ఈ ఆటంకాలన్నిటినీ దాటి జాయింటు ప్రొడక్షన్‌కమిటీలను స్థాపించాలి; అవి మూడు పార్టీలనుండి సహకారాన్ని సంపాదిస్తాయి. అధికోత్పత్తికొరకు ఒక బలమైన (ప్రజా) వ్యూహాన్ని నిర్మిస్తేనేతప్ప, వందలకొలది కార్మికులు వుత్పత్తిని బాగుచేయుటకు ముందుకొచ్చి పని ప్రారంభిస్తేనేకాని, ఫ్యాక్టరీలలోని ప్రతినిధులు కార్మికుల వుత్సాహాన్ని, చొరవను సమీకరించి సరియైన మార్గాల్లో నడిపించి ప్రత్యక్షంగా ఫలితాలను సాధిస్తేనేతప్ప యజమానులూ ప్రభుత్వమూ అంగీకరించే జాయింటు కమిటీలు నిర్మింపబడవు.

ఒక జాయింటు ఉత్పత్తికమిటీని స్థాపించగలిగామంటే అర్థం యేమిటి? కార్మికులు కొన్ని ఫలితాలను సాధించారన్నమాట; ప్రజలను తమవైపుకు తిప్పుకున్నారన్నమాట. వాటి సహాయంతో బాగా పనిచేసే యిట్టికమిటీలను గుర్తించకపోవుటకు ప్రభుత్వానికిగాని, యజమానులకుగాని యెట్టి అవకాశమూలేకుండా చేశారన్నమాట.

ఈనాటి అరాజక పరిస్థితినుండి, దానిమూలంగా వివిధ వర్గాలమధ్య పెరుగుతూన్న స్పర్థలనుండి బైటపడేమార్గం వెదకాలి; దానికొకటే మార్గం. అన్ని పరిశ్రమల్లోనూ: వ్యాపార సంస్థల్లోనూ; జాయింటు కమిటీలను స్థాపించాలి; వివిధ వర్గాలమధ్య సామరస్యాన్ని, సహకారాన్ని పెంపొందించాలి. జాతీయోత్పత్తిని దుర్భేద్యంగా నిర్మించాలంటే అదే మన ఆయుధం; ముఖ్య సాధనం.

ఈ కమిటీలద్వారానే ఉత్పత్తిలోకలిగే సమస్యలను. ఆటంకాలను వెంటవెంటనే పరిష్కరించుకోగలుగుతాము. వృథాగా రద్దుపోవుటను తొలగించి విడిభాగాలను జాగ్రత్తగా వాడుతాము. ఈమాత్రం చేయగల్గినాకూడ అది ఇండియావంటి దేశంలో చాల గొప్ప విజయమనేచెప్పాలి. ఉత్పత్తివిధానాల్లో (Processes) అభివృద్ధిని కనపర్చుటకు వ్యక్తులకెంతో ప్రోత్సాహం యివ్వగల్గుతాము; క్రొత్త మార్గాలను కనిపెట్టినందుకు, సూచనలు గావించినందుకు ప్రత్యేక బోనసులు, జీతాలు, బహుమానాలు యిచ్చేయేర్పాట్లు చేయగల్గుతాము - అంటే, అధికఉత్పత్తి సమస్యను నిర్మాణయుక్తంగా పరిష్కరించగల్గుతాము.

ముఖ్యంగా యీ కమిటీలపని ఉత్పత్తిని నిర్మించుట; దానికి జీతాల సమస్యతోగాని, యితర వివాదాలతోగాని సంబంధంలేదు.

"జాయింటు ప్రొడక్షను కమిటీల స్థాపన, వాటిని ప్రజామోదకరం చేయుట" - ఇది మన ప్రధాన కర్తవ్యాలలో మొదటిది, అది చేయకుండా మన పాలసీని ఆచరణలోపెట్టుట దుస్సాధ్యము.

## ఉత్పత్తి సమావేశాలు

వెంటనే మనం కార్మికులందరనూ వుత్పత్తి సమావేశాల ద్వారా కార్యరంగంలోనికి దింపాలి. మన అధికోత్పత్తి వుద్యమంలోనికి కార్మికులందరనూ సంఘటితపరచుటకీ సమావేశాలే ప్రాతిపదికలు.

ఇందులో నెగ్గాలంటే మీరు ముందుగా "ఉత్పత్తియే యీనాడు దేశభక్తియుతమైన పాలసీ" అని కార్మికునికి రాజకీయంగా నచ్చజెప్పియుండాలి; జాతియావత్తూ, దేశం అంతా వారియందు విశ్వాసంతో ఒక ప్రధానమైన కార్యభారాన్ని వారిచేత బెట్టిందనే భావం, చైతన్యం వారిహృదయాల్లో ప్రజ్వలింపజేసియుండాలి.

ఈ సమావేశాలు ఫలవంతం కావాలంటే, ముందుగా అభివృద్ధిహొందిన కార్మికులు పార్టీమెంబర్లు, మిలిటెంట్లు కూర్చుని ప్రతి పరిశ్రమను యెదుర్కొనే ప్రధాన సమస్యనుగూర్చి, టెక్నికల్ యిబ్బందులను గూర్చి, ముడిపదార్థాలు మొ॥ వాటి విషయంలో కలిగే యిబ్బందులను గూర్చి పూర్తిగా చర్చించాలి.

ఆటువంటి పునాదిమీదనే యేదైన ఆచరణీయమైన, నిర్ణీతమైన ప్లానును వేసికొనుటకు వీలవుతుంది; దానిని కార్మికులుగాని, లేక సంయుక్తంగా మూడు పార్టీలూ కలిసిగాని వెంటనే అమలు పరచాలి; వాస్తవానికి, కాన్ఫరెన్సు జరుగుటకు చాల ముందుగానే అట్టి ప్లాను తయారు చేయబడి సిద్ధంగా వుండాలి; దానిని యెక్కువగా కార్మికులచేత చర్చింపజేయాలి. తర్వాత కాన్ఫరెన్సుకూడ దానిని చర్చించి అంగీకరించాలి: అంటే కాన్ఫరెన్సుయొక్క పని పూరికే దానిని చర్చించడం మాత్రమేకాదనీ, ఒకప్లాను నాచరణలో పెట్టుటకు ప్రజలను ప్రబోధించుట అది ముఖ్యంగా చేసే పనియని గుర్తించాలి.

కాన్ఫరెన్సు యిచ్చిన నిర్ణయాలను మన ట్రేడ్‌యూనియను మెంబర్లు, పార్టీమెంబర్లు ధైర్యంతో ఫ్యాక్టరీల్లో అమలు జరపాలి.

‘ఈ వుత్పత్తి సమావేశాలు కొన్ని డిపార్టుమెంట్లకు మాత్రమే సంబంధించినవి గావచ్చు; ఒక ఫాక్టరీకైనా జరగవచ్చు; ఒకప్రత్యేక పరిశ్రమ అంతకూ సంబంధించినవిగా వుండవచ్చు.

కామ్రేడ్స్! మనం యిపుడొక మహాప్రమాదకరమైన పరిస్థితిలో వున్నాము.

జాతీయ సంక్షోభం రోజురోజుకీ తీవ్రతరమౌతూ మనలోని శత్రువు నెదుర్కొనే శక్తిని బలహీనపరచి నాశనం చేస్తూంది. జాతీయ సంక్షోభం వెనకాలనే ఆహారసంక్షోభం, ఉత్పత్తి సంక్షోభం బయల్దేరేయి. దేశంయొక్క ఆర్థిక జీవనాన్ని, దేశరక్షణలను పూర్తిగా నాశనంచేసే పరిస్థితి యేర్పడింది.

పంచమాంగదళం— జపాను సామ్రాజ్యవాదుల కనుకూల పరిస్థితిని కల్పించేవారు— యీ పరిస్థితిని బాగా వుపయోగించుకుంటూంది.

నిరంకుశాధికారుల కళ్ళకీ ప్రమాదం కన్పించడంలేదు; దేశభక్తులు యీ ప్రమాదాన్ని గుర్తించుటలేదు.

ఈ సంక్షోభం ప్రారంభమైనప్పటినుంచీ కూడ యీ ప్రమాద పరిస్థితి నెదుర్కొని యుద్ధం చేస్తూనే వున్నాము మనం.

రాజకీయరంగంలో మనం పంచమాంగదళాన్ని ఓడించేము. విధ్వంసక చర్యలను పురిగొల్పి అరాజకాన్ని కల్గించాలనే వారి యాశను పూర్తిగా భగ్నపరచేము.

ఉత్పత్తి రంగంలో ఉత్పత్తి మామూలుగా సాగేలా చేసేము. దేశరక్షణలను, దేశంలోని ఆర్థిక జీవనాన్ని నాశనం చేయాలని పంచమాంగదళం చేసిన దుష్ప్రయత్నాన్ని పూర్తిగా ఓడించేము.

కాని, యింకా మనం దేశరక్షణకు కీలకమైన ఉత్పత్తిని అధికం చేయుటకు పూనుకోనేలేదు.

మన పాత తప్పులన్నీ వెంటనే సవరించుకొమ్మనీ, దేశరక్షణకొరకు, జాతీయప్రభుత్వం కొరకు, ప్రతిష్టంభనా పరిష్కారం కొరకు, జాతీయనాయకుల విడుదలకొరకు, ఐక్యతయే మార్గం అను మనపాలసీ వెనుక మన వర్గాన్నంతనూ సమీకరించుటకు వెంటనే ఉత్పత్తిరంగంలో కార్యాచరణకు పూనుకోవలసిందనీ రాజకీయ తీర్మానం ఆదేశిస్తుంది.

ఫాసిస్టు వ్యతిరేక (విముక్తి) స్వాతంత్ర్య పోరాటంలో ప్రజలనందరను ఐక్యపరచే కార్యాన్ని కార్మికవర్గం నిర్వర్తించవలసి యుంది. దేశరక్షణ ప్రజలందరికీ సంబంధించిన సమస్య. అట్టి దేశరక్షణ కొరకు ప్రజలందరను తన వెనుక సంఘటిత పరచాలి కార్మికవర్గం. అధికోత్పత్తి కార్యక్రమాన్ని తీసికొని, సైన్యంయొక్క, ప్రజలయొక్క అవసరాలను తీర్చుటకై వుత్పత్తిని యెక్కువ చేయుట ద్వారా కార్మికవర్గం తనలోనూ ఐక్యతను సాధిస్తుంది ; జాతినంతనూ ఐక్యపరుస్తుంది ; తద్వారా తనకోర్కెలను సాధిస్తుంది ; దేశావసరాలను తీర్చి, దేశరక్షణను, ప్రజాసేవను చేయగల్గుతుంది.

ఈ కాంగ్రెసుయొక్క సందేశం మన ట్రేడ్ యూనియన్లలోని 3 లక్షల కార్మికులకూ, మన పలుకుబడిలోవున్న లక్షలకొలదీ యితరులకూ అందాలి ; రైల్వేల్లో, బట్టల మిల్లుల్లో, ఇనుప కర్మాగారాల్లో, బొగ్గుగనుల్లో పనిచేసే కార్మికులందరకూ "మీమీ స్థానాల్లో వుండియే మన స్వాతంత్ర్య పోరాటమును సాగించండి" అనే యీసందేశం అందాలి ; మంచి రాకపోకలసౌకర్యాలు, అధికోత్పత్తి, దేశరక్షణకొరకు, స్వాతంత్ర్యం కొరకు అధికసామర్థ్యం—యివీ దేశభక్తులైన మన కార్మిక వర్గానికి మన నినాదాలు. వీర రెడార్మీ చైనా సైన్యాలతోనూ, సోవియటు కార్మికవర్గం చైనా ప్రజలతోనూ చేయిచేయి కలిపి యీ ప్రపంచ స్వాతంత్ర్య యుద్ధంలో పోరాడుట కిదే మార్గం.

# మన ఉత్పత్తి విధానం - ట్రేడ్ యూనియన్ల కర్తవ్యాలు

(భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీయొక్క విస్తృత ప్లీనం సమావేశంలో అంగీకరింపబడిన తీర్మానం. 22 సెప్టెంబరు 1942)

"ప్రభుత్వం ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో భారతదేశపు పారిశ్రామిక వుత్పత్తి సంపదలను సమీకరించి సంఘటిత పరచలేకపోయింది. పైగా అది దేశరక్షణకు ప్రమాదకరమైన తప్పుడు పాలసీ నవలంబిస్తూంది. ఆ పాలసీవలన కలిగే ఫలితం ఒక్కటే. అది దేశములో అరాజకం ప్రబలి జపానును ప్రతిఘటించగల శక్తి నశించుతుంది" అని భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ విస్తృత ప్లీనం సమావేశం వుద్ఘాటిస్తూంది.

ప్రభుత్వం యుద్ధ పరిశ్రమలపై యెన్నో నిర్బంధాలను ప్రయోగించి వాటి అభివృద్ధి నరికట్టుతూంది. తద్వారా దేశరక్షణనే బలహీనపరుస్తూంది. నేటి పారిశ్రామిక యంత్రాన్ని పూర్తిగా వినియోగించలేకపోతూంది ప్రభుత్వం. ప్రజల మామూలు అవసరాలనుగూడ తీర్చలేకపోతూంది. రాకపోకల మార్గాలు సరిగా నడవడంలేదు. దాంతోటి దేశంలో కరువు, అరాజకం వ్యాపించడానికి అనుకూల వాతావరణం - ముఖ్యంగా శత్రు దండయాత్రాభయంవున్న యీనాడు - యేర్పడుతూంది. ప్రభుత్వపు వుత్పత్తి విధానం దోపిడీవల్ల వచ్చిన లాభాలను పంచుకోవడం మాత్రమే; ఆ పాలసీ పారిశ్రామిక పెట్టుబడిదారుల లాభదృష్టిని తప్ప దేనినీ ప్రోత్సహించజాలదు. క్రమం తప్పకుండా యెక్కువ లాభాలు తీయుట, యుద్ధ ఆర్డర్లను తమమధ్య పంచుకొనుటతప్ప యేవిధమైన నిర్మాణ యుతమగు ప్లానూలేదు. సప్లయి డిపార్టుమెంటుద్వారా ప్రజల అవసరాలను ప్రక్కనుంచి, మొదట ప్రభుత్వ అవసరాలకు ప్రాధాన్యతనిస్తుంది. ప్రజల జీవితం మామూలుగా సాగేటట్లు చేయుటకుగాని, ఉత్పత్తి నెక్కువజేయుటకు గాని యేవిధమైన ప్లానూలేదు; పైగా వర్తకుల అధిక లాభాల దోచుకొనేవిధానం (Profiteering) దేశంలో మామూలు జీవిత విధానాన్ని పూర్తిగా భగ్నంచేసేలా వుంది. ధరలు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. పారిశ్రామిక వస్తువులేవీ ప్రజలకు అందుబాటులో లేకుండా పోతున్నాయి. ఒకప్రక్క వున్న సరుకంతా సప్లయి డిపార్టుమెంటు కొనేస్తూంది. ఒకప్రక్క వస్తువుల ధరలు విపరీతంగా

పెరిగిపోయాయి. వీటి మధ్యపడి ప్రజలు తమ సామాన్య జీవితావసరాలుకూడ తీరక అవస్థలు పడుతున్నారు.

శతృ దాడులనుండి, దండయాత్రనుండి ప్రజలను, వుత్పత్తిని కాపాడుట కే విధమైన ప్లానూలేదు యింతవరకు పరిశ్రమాలయాల్లో ఎచ్చటా తగిన విమానదాడి రక్షణలు చేయబడలేదు. పారిశ్రామిక యంత్రాలను ఒకచోటనుంచి మార్చి మరొకచోటికి పంపుట కెట్టి యేర్పాట్లూలేవు; ఎటువంటి సంకట సమయంలోనూ ఆర్థికంగా ప్రజలయొక్క ప్రతిఘటనాశక్తి తగ్గకుండా చేయుటకు, వారి నిత్యజీవితం సాగిపోవునట్లు చేయుట కే విధమైన ప్లానూలేదు.

లాభాలు తినే యజమానులను సంతృప్తిపరచుటకోసం ప్రభుత్వం కార్మిక వర్గంమీద యెన్నో మోయరాని ఆర్థిక భారాలను విధిస్తూంది. వాటిని కార్మికుల చేత నంగీకరింపజేయుటకు బలాన్ని, నిర్బంధాలను ప్రయోగిస్తూంది. సంఘ నిర్మాణ స్వాతంత్ర్యమును, సమ్మెలుచేయు స్వాతంత్ర్యమును అరికట్టుతూంది. ఆర్డినెన్సులతో సమ్మెలను నిషేధించుటద్వారా యిష్టంవచ్చినట్లు పోలీసు నిర్బంధాలను ప్రయోగించుటద్వారా ఉత్పత్తిని సాగింప ప్రయత్నిస్తూంది ప్రభుత్వం. రెండుమాటల్లో చెప్పాలంటే ఉత్పత్తిని సాగించుటకు ప్రభుత్వం అవలంబించే సూత్రంయిది:— "సమ్మెలను నిషేధించండి; అతిక్రమిస్తే శిక్షించండి; బలవంతంగా దుర్భరజీవిత పరిస్థితులను కార్మికులపై రుద్దండి."

వారిపై నిర్బంధాలను ప్రయోగించి, తిండిలేక మాడ్చే యీ ప్రభుత్వ పాలసీవలన కార్మికులు కోపోద్రిక్తులై సమ్మెలకూ, ఉద్రేక కార్యాలకూ తలపడుతున్నారు. ఈ ప్రభుత్వ పాలసీవలన కార్మికులు తప్పనిసరిగా వుత్పత్తి నాపు చేయవలసి వస్తూంది. పారిశ్రామిక యంత్రం యే ఒడుదుడుకులూ లేకుండా ద్విగుణీకృతావేశంతో పనిచేయవలసిన యీ సమయంలో యీ పాలసీ తరచు ఒడుదుడుకులను కల్గిస్తూంది. అది కార్మికులను వుత్పత్తి కార్యక్రమంనుండి విముఖులను చేయుటేగాక శతృవులనుగాకూడ చేస్తూంది. దాని దృష్టిలో వుత్పత్తికీ దోపిడీ విధానంకూ యేమీ తేడా వున్నట్టులేదు; చివరకు కార్మికు లుత్పత్తి ద్వారా జాతీయ ప్రతిఘటనను నిర్మించుటకుకూడ విముఖులనుచేస్తూంది.

ఈ పాలసీ వున్నంతకాలం సమ్మెలు, పని ఆగిపోవుటలు యెక్కువవుతున్నాయి; ఉత్పత్తి బలహీనపడుతూంది. దానియెడల కార్మికుని అయిష్టత

రోజురోజుకీ పెరుగుతూంది. జాతీయ ప్రతిఘటనను బలపరచుటకు వుత్పత్తిని కొనసాగించాలనే అభిప్రాయం బలహీనపడుతూంది. అంటే శత్రు బాంబులకు, దాడులకు గురియైనపుడు ఉత్పత్తియంత్రం పూర్తిగా కూలిపోయేపరిస్థితి కల్పింపబడుతూందన్నమాట. జపాను బాంబులు పడతాయి అనే గాలివార్త విని వేల కొలది కార్మికులు కలకత్తా, బొంబాయి నగరాలను విడిచిపెట్టి వెళ్ళిపోయారు. ఆ పాఠం సరిగా అర్థంచేసికొన్నట్టయితే ముందు పరిస్థితులేవిధంగా వుంటాయో గ్రహించవచ్చును.

అధిక వుత్పత్తిని సాగించుటకు ప్రభుత్వం పారిశ్రామికుల సహకారాన్ని సంపాదించలేకపోతూంది. అది ప్రత్యక్షంగా విదేశ వ్యాపారసంస్థలకు పక్షపాతం చూపిస్తూండడంచేత పారిశ్రామికుల విశ్వాసాన్ని కోల్పోయింది; వారికి బాగా అపనమ్మకం; ద్వేషంకూడా వుంది ప్రభుత్వ విధానంయెడల. భారత ప్రజలకు జాతీయ ప్రభుత్వం నిరాకరించుటవలన, దేశీయ పారిశ్రామికాభివృద్ధికి ఆటంకాలు పెట్టుటమూలంగాను ప్రభుత్వం జాతీయ బూర్జువా వర్గాన్ని 'లాకౌట్లు', ఉత్పత్తికో ప్రతిష్టంభనలు మొదలైన తీవ్రచర్యలకు రెచ్చగొట్టింది.

## పారిశ్రామిక ధనికవర్గం (Industrial Bourgeoisie)

భారతీయ పారిశ్రామికులు ఫాసిస్టు దురాక్రమణకు వ్యతిరేకులు; జాతీయ ప్రభుత్వం కావాలనే డిమాండును పూర్తిగా బలపరుస్తారు. ఉత్పత్తి నెక్కువ చేయుట, పారిశ్రామికాభివృద్ధి నరికట్టి, దేశక్షేమానికే భంగకరంగా ప్రవర్తిస్తూందని వారు అనుటలో యేమీ తప్పులేదు.

అయినా ఆచరణలో వారు వుత్పత్తియెడల జాతీయదృక్పథాన్ని చూపించుటలేదు. నిరంకుశాధికారుల యినపగుప్పిట్లోనుండి వుత్పత్తి నీవలకు లాగుటకు వారు కార్మికులతోనూ, ప్రజలతోనూ సహకారం చేయుటలేదు; ఉత్పత్తి సమస్య పరిష్కరించుటకు కార్మికుల సహకారన్నడుగుటలేదు; కార్మికుల బలాన్ని తమతో సమకూర్చుకోలేక పోతున్నారు: అధికోత్పత్తికొరకు తమ అందరి తరపునా సంయుక్తంగా ముందుకు రాలేకపోతున్నారు.

దానికి బదులు కార్మికులను వారికి వ్యతిరేకంచేసే విధానాన్ని, జాతీయ ప్రతిఘటన నధికంచేయు పోరాటాన్ని బలహీనపరచే పాలసీని అవలంబిస్తున్నారు

వారు. ఉత్పత్తిపోరాటంలో శ్రామికులందరను జయప్రదంగా సమీకరించగల సామర్థ్యం ట్రేడ్ యూనియన్లకు మాత్రమే వుంది; అట్టి ట్రేడ్ యూనియన్ నిర్మాణాన్ని వీరు వ్యతిరేకిస్తున్నారు. కార్మికుల కోర్కెలను పరిష్కరించే విషయంలో ట్రేడ్ యూనియన్లతో సంప్రతించ నిరాకరిస్తున్నారు. అమల్లో వున్న నిర్బంధశాసనాలను పూర్తిగా వుపయోగించుకుని, కార్మికుని ఆర్థికపరిస్థితిని దుర్భరం చేస్తున్నారు. వారి పాలసీకి ఫలితంగా సమ్మెలు—పని ఆగిపోవుటలు యెక్కువౌతాయి.

ఇంక యేమీ చేయలేక, అధికారులమీద ఒత్తిడితెచ్చుటకై లాకౌట్లు, ఉత్పత్తిలో ప్రతిష్టంభనలు తీసుకొస్తున్నారు. కాని యీ పాలసీ శుద్ధ గడబిడకు అరాచకత్వానికీ మాత్రమే దారితీస్తుంది; శత్రువు నెదుర్కొనుటకు వుత్పత్తిని నిర్మించుట అనే ఆశయంకూడ పూర్తిగా ఓడింపబడుతుంది.

## కమ్యూనిస్టు పార్టీ – జాతీయోత్పత్తి

ప్రభుత్వమూ, పారిశ్రామికులూ అవలంబించే పాలసీలు యిల్లా పెడమార్గాలు తొక్కుతుంటే, ఒక్క కమ్యూనిస్టు పార్టీ మాత్రమే సరియైన పాలసీని అనుసరిస్తూంది; 'దేశరక్షణకొరకు, జాతీయప్రతిఘటనను బలపర్చుట కొరకు ఉత్పత్తిని నిర్మించాలి' అనే పునాదిమీద ఆధారితమై యున్నదా పాలసీ.

నేడు ఉత్పత్తియొక్క ప్రాధాన్యతను పార్టీ గుర్తించింది. "ఉత్పత్తి ప్రభుత్వానికో, యజమానులకో సంబంధించిన విషయం మాత్రమే" అనుకొనే రోజులు పోయాయని పార్టీ ఘోషిస్తూంది. ఈనాడు ఉత్పత్తి ప్రజలందరకూ సంబంధించిన విషయమైంది; వారి యునికి, స్వాతంత్ర్యం అన్నీ దానిమీదనే ఆధారపడి యున్నాయి. "ప్రజల విశ్వాసాన్ని చూరగొన్న జాతీయప్రభుత్వం ఉత్పత్తిపై అధికారాన్ని కల్గియుండాలి." అదే యీనాడు మన ప్రధాన నినాదం, కోరిక.

శత్రువు నెదుర్చు జాతీయప్రతిఘటన నెక్కువచేయుటకు ఉత్పత్తి నధికం చేయుట, విస్తృతంచేయుటకూడ చాలఅవసరం. ప్రభుత్వాధికారులు తమ అసమర్థతవల్లా జాతీయ ప్రతిఘటనావసరాలను గుర్తించకపోవుటవల్లా పరిశ్రమల్లోనూ,

రాకపోకల మార్గాల్లోనూ యెంతో సంక్షోభాన్ని, అరాచకాన్ని కల్గించారు; ఆ లోపాలను, అరాజకాన్ని వెంటనే తొలగించుట యెంతో అవసరం.

ఉత్పత్తి యంత్రం యింకా శిథిలమైపోకుండా కాపాడాలంటే, ప్రభుత్వమూ, పారిశ్రామికులూ అవలంబించే పిచ్చిపాలసీని— కార్మికులను సమ్మెలకు రెచ్చగొట్టే మూర్ఖవిధానాన్ని— యెదుర్కొని ఒడించవలసియుంది.

శత్రుదాడులనుండి దేశీయార్థికజీవితాన్ని రక్షించాలంటే, కార్మికులకూ, పారిశ్రామిక యంత్రాలకు తగిన రక్షణ యేర్పాట్లుచేసేలా ప్రభుత్వంమీద ఒత్తిడి తేవాలి. యంత్రాలను, ఫ్యాక్టరీలను ప్రమాదస్థానాలనుండి తప్పించుటకు, ప్రతి యంత్రాన్ని రక్షించుటకు సాధ్యమైనదంతా చేయుటకూ ప్రభుత్వంమీద ఒత్తిడి తేవాలి.

ఉత్పత్తిని జాతీయ ప్రతిఘటనాయుధంగా చేయాలంటే, అధికోత్పత్తికి సంబంధించిన సమస్యలన్నీకూడ ప్రభుత్వం, యజమానులు, కార్మికులతో కూడిన సంయుక్త సమావేశాల ద్వారా పరిష్కరింపబడుట అత్యవసరము. నిర్మాణ కౌన్సిల్సు, లేక వర్కర్ల కౌన్సిల్సు ప్రతి వుత్పత్తి సంస్థలోనూ యేర్పడాలి; ఉత్పత్తి సమస్యలను పరిష్కరించుటలోనూ, నిరుపయోగాన్ని తొలగించుటలోనూ (Avoid waste) వాటిని గుర్తించుట అత్యంతావసరం.

ఉత్పత్తిమీద పార్టీ దృక్పధం జాతీయదృక్పధం. దేశం ఆర్థికంగా పతనం కాకుండా ఉండాలన్నా, దండయాత్ర నెదుర్కొనుటకు మన ప్రతిఘటనను బలపరచాలన్నా తప్పక నిర్వర్తింపబడవలసినవిధిగా ఉత్పత్తిని పరిగణిస్తుంది మనపార్టీ.

అధికారుల చేతుల్లోంచి చొరవను లాక్కోవాలనేది మన ప్రధానమైన కర్తవ్యం. ఈనాడు ప్రభుత్వంయొక్క మూర్ఖపాలసీ ఆర్థికవిధానంలో కల్లోలం గల్గించి, జాతీయ ప్రతిఘటననే బలహీనపరచేదిగా వుంది; చొరవను ప్రభుత్వం చేతిలోనుండి లాక్కొనుటే దానికి మందు.

రేపు జపాను దండయాత్రి నెదుర్కోవలసింది మన ప్రజలే; వారి అవసరాలను తీర్చునట్లుగా అధికోత్పత్తి నిర్మాణంచేయుటే మన పాలసీయొక్క లక్ష్యం; మనదేశ స్వాతంత్ర్యంకొరకు జరిగే యీ పోరాటంలో వారికి తగిన సహాయాన్నిచ్చి నిలబెట్టుటే మన పాలసీయొక్క లక్ష్యం.

ఉత్పత్తిదారుడు — అతడే ప్రజలనందరను ఐక్యపరుస్తాడు.

ఈ పాలసీ నమలుపరచుటలో పార్టీ ముఖ్యంగా ఉత్పత్తినంతనూ నడిపించే కార్మికవర్గంపైననే ఆధారపడుతుంది.

ఇంతవరకూ వారు దుర్భరమైన దోపిడీకి బలిగావింపబడ్డారు; దానిమూలాన ఈరోజున కార్మికులందరూ అధికోత్పత్తియెడల విముఖులుగా వుండుటమాత్రమే కాక దానికి వ్యతిరేకతనుకూడ కన్పరుస్తున్నారు. ఈ వ్యతిరేకత పోనంతకాలం ఉత్పత్తి పూర్తిగా యజమానుల, అధికారుల చేతులలోనే వుంటుంది. అంటే దేశానికి ప్రమాదం యింకా యెక్కువయే పరిస్థితి అన్నమాట. కార్మికులు పూనుకోకపోతే ప్రమాద సమయాల్లో ఉత్పత్తి నడువదు; వుత్పత్తిదారుడు దానిలో హృదయపూర్వకంగా పాల్గొననంతవరకు అధికోత్పత్తిచేయుట సాధ్యంకాదు.

అందుచేత యిప్పుడు పార్టీ చేయవలసినపని కార్మికవర్గంలో (ఉత్పత్తి యెడల) జాతీయ దృక్పథాన్ని కల్గించడం- తాము రోజూచేసేపని తమ దేశభక్తియుతమైన కర్తవ్యంగా వారు భావించేటట్లు చేయాలి. తమకృషి దేశరక్షణకొరకు ప్రజలందరూ, జాతి అంతా చేసేకృషిలో భాగమే అనే చైతన్యం వారిలో కల్గించాలి. ఉత్పత్తి నెక్కువచేయాలనీ, లాభాలనే ముఖ్యంగా భావించడంమానాలనీ, స్వలాభపరాయణులైన యజమానులు కల్పించే ఆడ్డంకులన్నిటినీ తొలగించుట; ఉత్పత్తి విషయాల్లో తమనుకూడ సంప్రదించవలెనని కోరుట - ఇవన్నీ కోరుట తమ జాతీయ సేవానిర్వహణలో భాగమేనని, అవి నెరవేరితే వారు ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో ప్రముఖ పాత్రను నిర్వహించగల్గుతారనీ వారికి బోధించాలి. ప్రజాభీష్టంవైపుకు ప్రభుత్వాన్నీ, యజమానులనూ కదలించగల్గినది కార్మికులొక్కరే.

ఐక్యతాబలంతో తెచ్చే వొత్తిడిని ప్రభుత్వంగాని, పెట్టుబడిదారులుగాని యెంతమాత్రమూ ఎదుర్కోలేరు; వారిరువురూకూడ పూర్తిగా కార్మికవర్గంమీద నాధారపడియున్నారు. ఆ వర్గంతెచ్చే బలీయమైన ఒత్తిడి - దేశంయొక్క ప్రతిఘటనాశక్తి నెక్కువచేయుటకు తేబడుతూన్న ఒత్తిడి - తప్పకుండా ఫలితాలను సాధించి తీరుతుంది.

కార్మికవర్గం వీరోచిత దేశభక్తియుత కార్యాలను చేయవలసిన సమయం త్వరలోనే రానున్నది; శత్రు బాంబులు పడుతున్నా రైలుమార్గాలు మామూలుగా

నడచేలాచేసే బాధ్యత కార్మికులదే; శత్రుదాడులు జరుగుతున్నా ఉత్పత్తిని సాగించ వలసిన బాధ్యత వారిది; జాతీయ ప్రతిఘటనాశక్తిని కాపాడుటకై అవసరమైన పుడు పరిశ్రమలనే మొత్తంగా ఒక చోటినుండి మరొకచోటికి మార్చే బాధ్యత వారిది; ప్రతిఫ్యాక్టరీకూడ ప్రతిఘటనా కేంద్రంగా తయారవాలి; ప్రతి యంత్రమూ కూడ దేశ స్వాతంత్ర్యంకొరకు కొక ఆయుధంగా తయారుచేయాలి.

కార్మికవర్గంలోని దేశభక్తిభావాలను ప్రేరేపించి వారిని కార్యాచరణకు దింపితేనేతప్ప, స్వదేశ రక్షణకొరకు అమితోత్సాహం అతనిలో ప్రజ్వలించిననే గాని, ఉత్పత్తి తన దేశభక్తియుతమైన కర్తవ్యమనే చైతన్యం అతనిలో కల్గితేనే తప్ప, కార్మికవర్గం యీ మహత్తర కార్యభారాన్ని మోయజాలదు; భయోత్పాతా నికి లోనై చివరకు తమ స్థానాలను వదలి పారిపోవుటకూడ తటస్థించవచ్చు. ప్రభుత్వాధికారుల పాలసీయొక్క ఫలితాలు సంపూర్ణంగా సిద్ధిస్తాయి.

జాతీయోత్పత్తిని నిర్మించుటకు కార్మికవర్గం సాగించే దేశభక్తియుత పోరాటం తప్పక ప్రజలందరనూ శత్రు ప్రతిఘటనకొరకు ఐక్యపరచి తీరుతుంది. మన దేశ ప్రజలనందరనూ అది ఆకర్షించి తీరుతుంది. ఎందుచేతనంటే త్వర లోనే తమ స్వప్రయోజనములకొరకైనా ఉత్పత్తి కొనసాగాలనే విషయాన్ని వారందరూ గ్రహిస్తారు. ఉత్పత్తిని ప్రభుత్వాధికారుల, పెట్టుబడిదారులచేతుల్లో వొదిలేసి వూరుకోడానికి వీల్లేదని తెలుసుకుంటారు. శత్రు దండయాత్ర నెదు ర్కొనుటలో కార్మికవర్గం చూపించే ధైర్యస్థైర్యాలు, దేశభక్తియుత కర్తవ్య నిర్వహణలంటే యేమిటో ఇతరులకు మార్గదర్శకంగావుంటాయి; వారి సాహస కార్యాలు సోదర దేశీయులందరను వుత్తేజపరచి వారినికూడ అంతకన్న వీర కృత్యాలకు, సాహస కార్యాలకు పురిగొల్పుతాయి.

దేశభక్తియుతమైన వుత్పత్తిదారుగా తన పాత్రను జయప్రదంగా నిర్వ హించుటవలన కార్మికవర్గం ప్రజలందరను ఫాసిస్టువ్యతిరేక పోరాటంలో ఐక్య పరచి నడిపిస్తుంది. ఉత్పత్తిదారుడుగా కార్మికవర్గంయొక్క పాత్ర దాని రాజ కీయ నాయకత్వంతో యింకే సమయంలోకూడ యింత దగ్గర సంబంధాన్ని, కలిగియుండలేదు. అతడొకదానిలో జయించలేకపోతే రెండవదానిలోనూ ఓడి పోతాడు. ఉత్పత్తియెడల పార్టీ దృక్పథంయొక్క ప్రధానమైనప్రాముఖ్యత అది.

## పార్షల్. డిమాండ్సు — ఉత్పత్తి

వట్టి ప్రచారం, ఆందోళనల మాత్రంచేత కార్మికవర్గాన్ని మన పాలసీ వైపుకు తిప్పుకోలేము. ఉత్పత్తి అంటే యిప్పటివలె అమానుషమైన దోపిడీ విధానంగానే వుంటూన్నంతకాలం కార్మికవర్గం ఉత్పత్తిలో పాల్గొనుటను బాని సత్వంగానూ, వెట్టిచాకిరీగానూ పరిగణిస్తుందేకాని, తమ జాతీయ కర్తవ్యంగా భావించరు.

-స్వలాభపరాయణు లవలంబిస్తూన్న—(ప్రభుత్వం కూడ దీనినే ఆమో దిస్తూంది)—పాలసీని ఓడించేస్తేనేతప్ప మన పార్టీ పంథాను ఆచరణలో పెట్టడం సాధ్యపడదని యింతకు ముందే చెప్పేము.

మన పాలసీని కార్యాచరణలో పెట్టుటలో, కార్మికవర్గపు తక్షణకోర్కెలను, అవసరాలను కాపాడుట, వాటికొరకు పోరాడుటకూడ ఒకప్రధానమైన విషయమే.

యుద్ధోత్పత్తి పేరుచెప్పి కార్మికవర్గ ప్రయోజనాలను పెట్టుబడిదారుల చేతుల్లో వప్పజెప్పుటకు వీలులేదు. అల్లాచేయడం అన్యాయమూ, అమానుషమే గాక జాతీయ విద్రోహం కూడాను; ఎందుచేతనంటే, దాని మూలాన కార్మిల లోని ఉత్సాహము, చొరవ నశించి, ఉత్పత్తిని కొనసాగించుట యెడల, అధికోత్పత్తి చేయుట యెడల వారిని విముఖులను, వ్యతిరేకులను గావిస్తుంది.

ప్రభుత్వ ఫర్మానాలకు లోబడి, భయపడి, మన సంఘనిర్మాణ హక్కులను వదులుకోగూడదు; పైగా, అధికోత్పత్తిని కొనసాగించుటలో కార్మికవర్గం తన ప్రముఖపాత్రను నిర్వహించాలంటే, నాయకత్వం వహించి నడపించాలంటే, యిప్పటికన్న యెక్కువ హక్కులు, అవకాశాలు కావాలి; వాటిని సాధించితీరాలి.

'సమ్మెచేయు'_ హక్కును కార్మికవర్గం యెట్టి పరిస్థితులలోనూ కూడ వదులుకో జాలదు; దాన్ని వదులుకొనుటకు పార్టీ యెన్నడూ తన అంగీకారాన్ని యివ్వదు కూడాను.

ఈ క్రింది ఐదు కోర్కెలను వెంటనే నెరవేర్చవలసిన తక్షణకోర్కెలుగా పార్టీ ప్రకటిస్తూంది.

(1) యెన్నో రెట్లు పెరిగిపోయిన నేటి ధరలకు తగినట్టుగా ప్రతిఫలం యివ్వాలి. కరువుభత్యాల నివ్వాలి.

(2) తక్షణమే ' బోనసు ' లను కూడ యివ్వాలి.

(3) అసలు జీతం (Basci wage) లో 25% యెక్కువ చేయాలి.

(4) ట్రేడ్ యూనియన్లను వెంటనే గుర్తించాలి ; తమ కోర్కెలను, ఉత్పత్తి సమస్యలను పరిష్కరించుటకుగాను ప్రతి ఫ్యాక్టరీలోనూ, మిల్లులోనూ కమిటీల నేర్పరచుకొనుటకు పూర్తి స్వాతంత్ర్యం వుండాలి.

(5) ప్రజల క్షేమంకోరి, అధికలాభాల నరికట్టాలి.

ఈ కోర్కెలను అజాగ్రత్తగా చూడ్డం అంటే మన ఉత్పత్తి పాలసీనే సర్వనాశనం చేయుటన్నమాట. వాటిని సాధిస్తేనే కార్మికవర్గం అధికోత్పత్తిలో దేశభక్తితో తన ప్రముఖపాత్ర నిర్వహించేలా చేయగలం.

కాని, యీ తక్షణకోర్కెలను సాధించుట మాత్రంతో మన పని అయిపోదు. వీటి విషయంలో సాధించిన ప్రతివిజయమూ కూడ, దేశంకొరకు, జాతీయ ప్రతిఘటన నధికం చేయుటకొరకు వుత్పత్తిచేయుట తమ కర్తవ్యమని వారికి బాగా నచ్చజెప్పాలి : తమ దైనందిన విధులయెడల విప్లవచైతన్యం వారిలో కల్గించాలి ; కార్మికుల దైనందిన ప్రయోజనాలను కాపాడుటను, కోర్కెలను సాధించుటను మన వుత్పత్తిపాలసీ నుండి వేరుచేయుటకు వీల్లేదు.

## తక్షణ కోర్కెలకొరకు పోరాడుట — సమ్మెలు
## (Enforcement of Partial Demands & Strikes)

సమ్మెచేయు హక్కును వొదిలిపెట్టుటకు మనం అంగీకరించం ; కాని సాధ్యమైనంతవరకు - కార్మికవర్గం యొక్క, దేశంయొక్క ప్రయోజనాలకు, క్షేమానికి భంగం కలగకుండా వుండేపద్ధతిలో - సమ్మెలు, పని ఆగిపోవుటలు మొదలైన వాటిని తగ్గించుటయే మన పాలసీ.

" పని ఆగిపోకుండా చూచుట—కార్మికుల దైనందిన కోర్కెలను రక్షించుట " యిది వట్టి దబాయింపు మాటకాదు మనదృష్టిలో- ఆ రెండింటికీ వైరుధ్య

మేమీలేము. మన యుద్ధ పూర్వపు అనుభవం యీ విషయంలో యెక్కువ మార్గ దర్శకంగా వుండదు.

ప్రస్తుత పరిస్థితుల్లో కార్మికవర్గాన్ని దేశవ్యాపితంగా సమ్మెలు మొ॥ చర్యలకు రెచ్చగొట్టుట తమ స్వవినాశానికే దారితీస్తుందనే విషయాన్ని ప్రభుత్వమూ, యజమానులూ కూడ గుర్తిస్తున్నారు. ఈమధ్య అనేకమార్లు కార్మిక వర్గం తన ఐక్యతాబలంతో వారి నెదుర్కొని ఓడించి, తన కోర్కెలను సాధించింది. (బొంబాయిలో రోజుకి పదిగంటలు పనిచేయాలని యజమానులు బలవంత పెట్టినపుడు.) యెదర కార్మికవర్గం నుండి ఐక్యప్రతిఘటన లేనపుడు మాత్రమే వారు తమ స్వలాభప్రేరితమైన దోపిడీవిధానాన్ని అమలు పరచగలుగుతున్నారు. ఐక్యతాబలంతో ప్రత్యక్షచర్యలకు (సమ్మెలు మొ॥) దిగుతారేమో అనే భయం మూలాన ప్రభుత్వమూ, యజమానులూ రాజీకి దిగి వివాదాలను పరిష్కరిస్తారు. 'కన్సీలియేషన్ కోర్టులు' (Conciliation Courts) మొ॥ వివాద పరిష్కార యంత్రాలను— పూర్వం వీటిని బలవంతాన అంగీకరించేవాళ్ళం — పూర్తిగా వుపయోగించుకుంటాము. అందుచేతనే, "కార్మికులందరను ఐక్యపరచి, ఆ బలంతో రాయబారాలద్వారా వివాదాలను పరిష్కరించుటకు ప్రయత్నిస్తాము; అవన్నీ విఫలమై తప్పనిసరియైనపుడు మాత్రమే ప్రత్యక్ష చర్యలను (సమ్మెలు మొ॥) దిగుతాము" ఇదీ మన పాలసీ.

## ట్రేడ్ యూనియను రంగంలో మన కర్తవ్యాలు

మన ట్రేడ్ యూనియను కార్యక్రమంమీద యీ పాలసీవలన అనేక కొత్త బాధ్యతలు పడుతున్నాయి.

ఉత్పత్తియెడల దేశభక్తియుతమైన పాలసీ కనుకూలంగా ఉత్పత్తిని ప్రజలచేతుల్లోకి తెచ్చుటకుగాను ట్రేడ్‌యూనియన్లద్వారా కార్మికవర్గం అంతనూ సమీకరించుటయే మన ముఖ్య కర్తవ్యం.

అంటే తమ దైనిక ప్రయోజనాలను రక్షించుకునేందుకు అన్ని పరిశ్రమల్లోని కార్మికులను కదలించగల శక్తిని, బలాన్ని ట్రేడుయూనియన్లు పెంపొందించుకోవాలి; అవి యేవో కొన్ని అభివృద్ధిచెందిన భాగాలనేకాక వర్గాన్నంతనూ

ర్తిగా సమీకరించుటకు తగిన బలాన్ని కలిగియుండాలి: ముఖ్యంగా కీలక పరిశ్రమలలోని రాకపోకల మార్గాలు, ఇనుము, ఉక్కు పరిశ్రమలు, బొగ్గు గనుల కార్మికులను తప్పక సమీకరించాలి.

ఇంతకుముందే మనం సంఘటితపరచిన వారిని మాత్రం సమీకరిస్తే చాలదు. కీలకపరిశ్రమల్లో మన ట్రేడుయూనియన్లు చాల బలహీనంగా వున్నాయి. శత్రుదాడి భయంవున్న రాష్ట్రాలలో మన కార్మికవర్గ పునాది బలహీనంగా వుంది.

ట్రేడుయూనియను కార్యక్రమంయొక్క పరిమితి చాల విస్తృతం అవాలి. మితవాద ట్రేడుయూనియన్లకు (Reformist T. U) కూడ అది విస్తరించాలి. కీలక పరిశ్రమలలోకి, సంఘ నిర్మాణం లేకుండాయున్న కార్మికులలోకి అది వ్యాపించాలి.

అందరియొక్క సామాన్యాశయ సిద్ధికొరకు, కర్తవ్య నిర్వహణకొరకు వర్గాన్నంతనూ పూర్తిగా ఐక్యపరచుటకు చూస్తుంది మన పాలసీ. ఆ కర్తవ్య నిర్వహణకు, యిపుడున్న ట్రేడుయూనియన్లను చీలదీయుటకాదు మార్గం.

అన్ని భాగాలను కూడగట్టుకుంటూ ట్రేడుయూనియను వుద్యమాల్ని బలపరచి విస్తరింపజేయుటకు ఒక సక్రమమైన ప్లాను వేసుకోవాలి. అదొక్కటే ప్రస్తుత పరిస్థితుల కనుగుణ్యమైన సంధా.

అంటే, అన్ని ట్రేడుయూనియన్లుచేసే దైనందిన కృషిలోకూడ అద్భుతమైన అభివృద్ధి జరగాలన్నమాట. మునుపటికిమల్లే మామూలు ఆందోళనతో సంతృప్తిపడి వూరుకొనుటకు వీల్లేదు. మన "జనరల్ పాలసీ"ని దృష్టిలోనుంచుకొని, ఆ దృక్పథంనుండి ప్రతి ట్రేడుయూనియను తగాదాను సరిగా అర్థంచేసుకోవాలి; ఆ దృక్పథంనుండే దానియొక్క ప్రాముఖ్యతను సరిగా అంచనా వేయాలి. "జీవిత వ్యయానికి సంబంధించిన అంకెలు, యితర వివరాలు (Facts & figures regarding cost of living) స్వతంత్రమైన స్టేటిస్టిక్సు - వీటిమీద నాధారపడి న్యాయమైన కోర్కెలు" - ఇవి మన ఆందోళనా కార్యక్రమానికి పునాదిగా వుండాలి. పెద్ద పెద్ద (తీర్చరాని - Exaggerated) కోర్కెలను పెట్టుకుకూర్చుని పరిష్కారాన్నసాధ్యంచేయు వైఖరి యెట్టి పరిస్థితులలోనూ

మానుకోవాలి. న్యాయస్థానంలో కార్మికుల కేసును సమర్థించి నిలబెట్టుకోలేక పోవుటనొక పెద్ద నేరంగా పరిగణించాలి. నాయకుల అసమర్థతవలన తప్పనిసరిగా కార్మికులు సమ్మెచేయవలసిన పరిస్థితి యేర్పడుతుంది దానివలన.

దైనందిన కార్యక్రమాన్ని, కార్మికుల కోర్కెలను వెంటవెంటనే తెలియ పరుస్తూండడాన్ని అజాగ్రత్తచేసి, దానికి బదులుగా మామూలు రాజకీయప్రచారం చేయు పద్ధతిని తీవ్రంగా యెదిరించాలి.

మన ట్రేడుయూనియన్లు చేసే ఆందోళన నిర్ణీతంగానూ, సూటిగానూ వుండాలి; మన ట్రేడ్‌యూనియను కృషి మార్గదర్శకంగా, నిర్దుష్టంగా వుండాలి; మన ట్రేడుయూనియను సంస్థలు మళ్ళీ ప్రజా సమీకరణ కేంద్రాలుగా - తమ కోర్కెలను సాధించుటకు కార్మికులు గావించే పోరాటాలలో నిర్మాతలుగా, నాయకులుగా తయారవాలి.

దినదినాభివృద్ధి చెందుతూన్న మన బలంతో అఖిలభారత ట్రేడుయూనియను కాంగ్రెసును మన పాలసీవైపుకు తీసుకురావాలి. ఇపుడు అ. భా. ట్రే. యూ. కాంగ్రెసు గోడమీద పిల్లివాటంగా కూర్చుందంటే దానికి కారణం మన బలహీనతయే. ఈరోజున మన ఉత్పత్తివిధానం కొందరు గుడ్డి దేశభక్తులాచరించే పాలసీకి వ్యతిరేకంగా వుంది; రెండింటికీ పెద్ద సంఘర్షణ జరుగుతుంది. ప్రతిష్టంభన కలిగించాలనేపేరుతో వారు ఉత్పత్తిమీదనూ, రాకపోకల మార్గాల మీదనూ దండెత్తుతున్నారు; విధ్వంసక చర్యలకు ప్రయత్నిస్తున్నారు; కార్మికుల ఆర్థిక యిబ్బందులను తొలగించు మిషతో అంతులేని సమ్మెలు చేయించుటకు కృషిచేస్తున్నారు; కార్మికులలో భయోత్పాతం-కల్గిస్తున్నారు; హింసకు, విధ్వంసక కార్యాలకు వారిని రెచ్చగొట్టుటకు ప్రయత్నిస్తున్నారు. పంచమాంగదళానికి అనుకూలమైన వాతావరణాన్ని, పరిస్థితులను సృష్టిస్తున్నారు. వాళ్ళ వెర్రివుద్రేకంలో వారు ఉత్పత్తిని విచ్ఛిన్నం చేయడమేగాక కార్మికవర్గంయొక్క నిర్మాణ బలాన్ని (Organised strength) కూడ ధ్వంసంచేస్తున్నారు.

ఉత్పత్తికి వ్యతిరేకంగా చేస్తూన్న యీ జాతీయ విద్రోహకరమైన దండయాత్ర నెదుర్కొని తరిమికొట్టాలి. కార్మికవర్గంలో చీలికలుదెచ్చే యీ ప్రయత్నాన్ని పూర్తిగా ఓడించాలి.

కార్మికులందరూ బలమైన ట్రేడుయూనియన్లలో సంఘటితమై యున్న చోటనూ ట్రేడుయూనియన్లు వారి ప్రయోజనాలను కాపాడే సంస్థలుగా కార్మికుల విశ్వాసాన్ని పొందిన స్థలాలలోనూ యీ దండయాత్ర పూర్తిగా అపజయం పొందుతుందనే విషయం యీ కొద్దిరోజుల అనుభవాన్నిబట్టి స్పష్టమైంది.

అంటే, ఆర్థిక కోర్కెలవిషయంలో కార్మికులను యీ విధ్వంసక దండ యాత్రనుండి రక్షించాలంటే, మన ట్రేడుయూనియన్లు చొరవతోపనిచేసి, కార్మి కులను పంచమాంగదళ ద్రోహుల చేతుల్లోకి, అంతులేని సమ్మెలను పురిగొల్పే వారి చేతులలోకీ పోకుండా చేయాలి.

ట్రేడు యూనియన్లలోనూ, తమ వర్గంయొక్క రాజకీయ పార్టీయైన భారత కమ్యూనిస్టుపార్టీలోనూ కార్మికవర్గంయొక్క విశ్వాసాన్ని బలపరచాలంటే ట్రేడుయూనియన్లు తమ ఆందోళనను యిప్పటికన్న వెయ్యిరెట్లు యెక్కువ చేయాలి.

అంతులేని సమ్మెలు వారిలోని ఐక్యతను విచ్ఛిన్నంచేసే వుద్దేశ్యంతో రెచ్చగొట్టబడుతున్నాయనే నిజాన్ని బట్టబయలుచేయాలి; అట్టి ప్రయత్నాల నెదు ర్కొన తమ ఐక్యతను నిర్మించుకోవలసినదిగా కార్మికులనుద్బోధించాలి. విధ్వం సక కార్యక్రమం పంచమాంగదళంయొక్క పనిసుమా అని కార్మికులను హెచ్చ రించాలి. తాము వీధుల్లోవున్నపుడు (అంటే, సమ్మెకాలంలో) శాంతంగావుండ వలసినదిగా వారికి బోధించాలి.

అసలీ అంతులేని సమ్మెలు వగైరా నాటకమంతా జాతీయ విద్రోహకర మైనదనీ, అది కార్మికులనూ, భారత జాతినీకూడ సర్వనాశనం చేస్తుందనీ బాహా టంగా చాటి చెప్పాలి.

పార్టీయొక్క ఉత్పత్తి పాలసీకూడ పార్టీ రాజకీయపంథాకు అనుగుణం గానే వుంది.

పార్టీ యీ యుద్ధాన్ని జాతీయ స్వాతంత్ర్య యుద్ధంగా పరిగణిస్తుంది. అందుచేత ఉత్పత్తిచేయుట అంటే స్వాతంత్ర్యంకొరకు వుత్పత్తి అన్నమాట. జాతీయోత్పత్తిగా దీనిని నిర్మించి కొనసాగించాలి. ప్రజలకొరకు, దేశంకొరకు

